

# లక్ష్మీగర్వభంగము.

ఇయ్యది.

శ్రీపావరం వా|| ప్రత్తిపాటి నాగభూషణము గారిచే

రచియింపబడి ప్రకటింపబడియె.




మొదటికూర్పు 1000 ప్రతులు.

భీమవరం

శ్రీవరలక్ష్మి విలాస ముద్రణాలయమునందు

ముద్రితము.

ప్రభవ సంవత్సరము] 1927 [వెల 1—0—0

శ్రీ



# లక్ష్మీగర్వభంగము

[illegible]

శ్రీమాన్ పం॥ కా॥ ప్రత్తిపాటి నాగభూషణరావు గారిచే

రచియింపఁబడి ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు.

---

భీమవరం

ధనలక్ష్మీ విలాస ముద్రణాలయమునందు

ముద్రితము.

 1927 [వెల 1—0—0

ఓం



# లక్ష్మీగర్వభంగము.

ఉ. శ్రీరమణీయమై మిగుల । జెన్నలరారెడి పారిజాతస్వీ
కారముకై నిజేశుదన । కాలనుదన్నిన సత్యనాతులా
భారముపట్టనందులసి । పత్రము చేతబరాభవించనే
వారిజనేత్రి తత్ప్రావయ । వాసుదు కృష్ణుమమిమ్ము
బ్రోచుతన్

(జనార్దనమహారాజు మంత్రి కూర్చుందురు)

జ—అమాత్యపరా మనపురంబునం గల చతుర్వర్ణములవారును దమ తమ విద్యుక్త కర్మలననుసరించి దారిద్ర్యదేవత కెడమీయక భగవత్సేవానందులై సత్యవచో ధర్మార్థకామ మోక్షాభిమానులై సుఖంబునం బరగుచుండిరే!

మం—నృపచంద్రమా! యథారాజా తథాప్రజా అననట్లు సత్యమున హరిశ్చంద్రునకు శాంతమున శ్రీరామునకు త్యాగమున శిబికి పరాక్రమమున బరశురామునకు భక్తికి బ్రహ్లాదునకు బ్రతిమానులై వైకుంఠమునుండి భూమింగల సర్వభూతతతులం బాలింప గష్టతరంబని యెంచి యానారాయణుండే జనార్దననామంబున నిందవతరించెనోయనునట్లు దమరవతరించిరు గారన

ప్రవాహంబునం బ్రజల నోలలాడించుచుండ నింకేమి కోప ముందును.

జ.— నేఁడియేగో యవది గాని,

పాట.

ఎంతో । సందేహమాయె ! నాదుమానసం । బిపు ॥ఎం॥

సంతసమున సకలవేద । శాస్త్రవేత్తలనగాని । మొదటరాజునాజ్ఞ యంచు ! పిదపనమ్మదు దేవునాజ్ఞ ॥యెం॥

అందుకుతెగు కారణమే । మైనగలిగి యుండునో కో । మదిని చింతి జేసిదెల్పు । మంత్రివర్య వినగదలతు । నెం॥

మం.— దేవా రాజాజ్ఞయే దైవాజ్ఞగా నెంచవలెననే భావముతో రాజ భక్తినిబోధింప కవులిట్లు వ్రాసియుండవచ్చును .

(తెరలో పాట)

జ.— అదుగో హరిభజనజేయుచు నారదమహానీంద్రుడు వచ్చుచున్న వాడు. ఈసంశయము వారిచే నివారణకాగలదు.

(నారదుడు ప్రవేశం.)

హరినారాయణ గోవిందా సక । లాఘని పాలగిరిధారీ । కరివరదా కలుషుల చెలిదోర । ఖగరాడ్గమనమురారీ ॥హ॥

సురారి భంజన పరాత్పరాఘన । ధరాదిభూతవిమర్ధనా । మనుజనకా మందర గిరిధర । సరసిజనయన పరాకా ॥హ॥

జ. మం.— మహీంద్రా వందనము. ఈయాసన మలంకరింపుడు.

నా.— రాజేంద్రా! మీయందరకు క్షేమమా

జ.— మహాత్మా! భవదీయానుగ్రహంబుచే నందరము సుఖులైయు న్నారము తమరెచ్చటనుండి యిచ్చటకు విచ్చేసితిరి.

నా.— క॥ వినినంత దృప్తినొందక

గనుగొని యిహనాటకమును । గెకొనిసార

బును వెల్లడించి ప్ర . లకు
ఘనమున హరిభక్తిఁ గొల్ప । మసలుచు నుంటిన్॥

జ— ఔను అనభవము లేనిమాటయు నంద మెరుగని పాటయు న
విశ్వాసనీయములుగదా దేవా ఈ జగన్నాటకంబున దమరు
చూచిన విషయములలో ముఖ్యమైనవి గొన్నిటిని శెలవిండు

నా— సీ॥ నరులకు బశువృత్తి ♦ నరవృత్తి బశులకు
దనరిచరించు మగాం ♦ దరిని గంటి
కండితులకు రక్తి ♦ పామరులకు భక్తి
దనరఁ జరించు మగాం ♦ దరిని గంటి
భోగిశ్లాఘనమున ♦ త్యాగిలాఘవమున
బరికించువారిగాం ♦ దరిని గంటి
ప్రభుసేవ భటునకు ♦ ప్రభునకు భటసేవ
దనరిచరించుగాం ♦ దరిని గంటి
గీ॥ స్త్రీలు బురుషుల పురుషులు ♦ స్త్రీలవృత్తి
దనరిచరియించు వారిగాం ♦ దరిని గంటి
జూచితిని కెన్నియో గదు ♦ జోద్యములను
బూటకంబైన బ్రాపంచ ♦ నాటకమున॥

జ— ఆహా ప్రపంచమెంత యవనీతికరంబై యున్నది. మహాత్మా!
నాయీసందేహంబును వారింపుడు రాజాజ్ఞ దైవాజ్ఞ యనుట
లో మానవమాత్రుండగు రాజాజ్ఞ ముందుగా నుచ్చరించుట
కేమైనగారణమున్నదా!

నా— ఆ లేకేమి వినుము
క. ఇహపరములు రెండింటను
నిహమున రాజాజ్ఞపరము । నీశ్వరునాజ్ఞన్
సహజముగ జెల్లునందున
నుహినరపతి ధర్మవృత్తి । మసలగవలయున్॥

మం—సత్యము సత్యము దానిభావము బాగుగ సెలవిచ్చితిరి.

జ—మహాత్మా! తమరు సెలవిచ్చినది నాభావమునకు సరిపోయినది. పరసుఖములనీయు భగవంతునివలె నిహసుఖములనీయు రాజులును సమర్థులైయుండియు

గీ॥ మత్సరంబునదుష్ప్రవృత్తి । మరగిస్వసుఖ
దమసుఖమెగాని ప్రజల దు । ర్దశవగోరి
తెలసి రక్షించు బుద్ధిని ! గలుగకున్కి-
యణగిపోదయ్యో దారిద్ర్య । మనెడిమాట॥

మ—యదార్థము. అందరు దమకోటి ధర్మపరులేయయినచో దారిద్ర్యమన నెవ్వరెరుంగుదురు

నా—రాజా! నీసత్కీర్తివినియే నిన్నుజూడవచ్చితి. నీవు మిక్కిల గరుణారస హృదయుండవు. సార్థక నామధేయుండవని నీవాక్యములచే గ్రహించితిని గాని?

కీర్తన.

మానవునకు సాధ్యముగాదది విను । మా దారిద్ర్యము రూపు మాపగను ॥మా॥ పూనికతోడా నెన్నిమార్గముల । బొందింపగదలచిన శిరియుండదు ॥మా॥ వారక మానవు జేపనికైనను । గోరిప్రయత్నము జేయుటెగాని । వారిజగర్భుడు కృపగనకుండిన । వట్టిది తత్ఫలమందదు సుమ్మా । ధరపతి-గనుమిది-దెలిపితి-స్థిరమిది॥ అరయుము వారల పుణ్యవశంబున । నదృష్టము జేబట్టినగాని । మా॥

జ— మానివరా! తమకు పొరబడుచున్నవారు. ఇహసుఖములనీయ నీశ్వర కృపగావలెనా? ప్రభువుచాలడా.

నా—చాలడు. ఇట్లు వినుము.

క॥ నరుడెంత కృషినిసల్పిన
గురుతర కర్మానుసరణి । గూడును కలుములే

ఎరువెంత జోసినాటిన
గురిజకవృక్షంబు పైతు । గొనునే ఫలమున్॥

జ—అది వేరుమాట. కర్మచే కలిమిసంపాదించలేకపోవచ్చును. నీరు లేమిని చేను పండకపోవచ్చును. గాని, నదీ జలింబులంగొని తెచ్చి పెంచుపైరులట్లు ధనంబుగొని తెచ్చి యర్పించిన నాత డేల బాగుపడకుండు.

నా—అట్లిచ్చినను నిలువనేరదు

గీ॥ వసుమతి నదృష్టవంతుడా। వానికల్మి
నారికేళఫలాంబుల। న్యాయమొనవు
నట్టుల నదృష్టహీనుడా। నతనికల్మి
దంతిభుక్త కపిత్థమై। తరిగిపోవు॥

జ— పాట

మానిచంద్రవమా । సందియంబు దీర లేదునామది ॥మా॥
అనఘు కోరిన-త । అర్థిమి వ్వ నెవ్వ । డైన బాగు-డుట। కబ్బురంబె।
నందియంబదేటికి ॥మా॥ ధనమూలం జగ । తని బల్కలేదె ! క
నకమున్నవాని । కంత హస్తగతమె । ఘనులైన విద్యా । ధనులైన
యుక్తి ! పనులైన వాని । పాదసేవ జేయుచుండు నిజముగ॥

నా—(తనలో) ఆహా సుగుణఖని మగుబూరాజునకీకళంకంబొందు
పీడించుచు మహాక్షుద్వారంబున కడ్డుపెట్టుచున్నది. దీనినెట్లు
దొలగింతును చెపుమా.

జ—

చ॥ ఆనఘుచరిత్ర భూమిసుదుల । కడ్డముజెప్పినినం మనాగ్రహం
బును మదికి దవద్దు యతి । పుంగవనాపరిపాలనంబునం
దినటకు గూడు లేనియొక । దీనజనంబగమ్ర వేలుబెట్టినా
కనులకుజూపిరే నచిర । కాలము గాతని ధన్యతే సెవన॥

నిష్కామచిత్తులై ♦ నిష్ఠజేసెడివారి
నరసిహోత్సంబున ♦ కంపు నుండ
కఠిన శిలలమధ్య ♦ గలకప్పలకునైన
జాలిన జలమిచ్చి ♦ సాకుచుండ

గీ॥ నుదకములు సూర్యచంద్రులు ♦ నోషధులును
వసుధజీవులకుపయుక్త ♦ వసతులన్ని
గలుగజేసిన హరినన్ను ♦ గావలేడ
తప్పకనొసఁగు కర్మకు ♦ దగినఫలము॥

ఇంక నింటికిబోయెద. ఆ జగదీశ్వరుడే రక్షింపగలడు. (మోపు నెత్తుకొనిపోవును.)

జ—హా! చంద్రమా! నేనెంతపాపాత్ముండ, ఇంతకాలంబునుండియు నిట్టి భక్తిజ్ఞానంబులుట్టిడు నీమహాభక్తుడు దారిద్ర్యముచే బీడింపబడుచుండ దెలసికొననైతిని, సరే, వీని గృహంబును, భార్యాపుత్రాదులను కూడ జూతమురండు (నిష్క్రమింతురు)

తెర వాలును.

---

రంగము—నాగభూషణం యిల్లు.

(శారద జనార్ధనులు మరుగుగానుందురు)

(నాగభూషణం భార్య మహాలక్ష్మియు పసుడును నలువురు కొడుకులు చుట్టును కూర్చుండి)

పాట

1. అమ్మా బువ్వపెత్తు మాకాకలయ్యెనమ్మా
పుమ్మిరాదు ప్రాణములుకు | పూడుచుండె నిలువజాల॥న

2. కడుపువెన్ను నంటిబోయె గంటజూడవమ్మా
తిరిగిపోవుచుండెకండ్లు | దేహమెల్ల చెమటబట్టె॥

వెళ్ళిరి కాండం కాశీ

ఇచ్చిన శవమైతినేమి । సార్థకమబలా

మ—నాథా! యిదిమన మెవ్వరికిని జెట్టవిరో జా. విచారించిన నేమి ఫలము.

క॥ దానము ధర్మంబెరుగని
మానవతతి జచ్చిబుట్టు । మనవలె నిలలో
గాన నిపుడెవ్వరికిక
దీనులరక్షించు విష్ణు । దేవుడు తేష్ఠ॥

అతడేదియో మార్గము జూపకమానడు.

జ—నారదఋషీంద్రా! అబ్బబ్బా! సహింపజాల.

ఉ॥ ఆకలికోర్వలేక సుతు ♦ లట్టులగొల్లున గోలపెట్ట దా
నాకలిబాపు మార్గమర ♦ యంగనరాకిటు తల్లియెద్దనే
నేకరణింభరింతు నిక ♦ నెవ్వరు దిక్కని తండ్రి నేలపై
శోకముతోడ గూలనెటు । జూడగనోపుదు వీరిదుఃఖమున్॥

నేనిప్పుడేపోయి వారిదుఃఖము బాపెద. (పోబోవుచు).

నా—(చేయిబట్టి) రాజా ఆగుము యింక వీని గుణవిశేషంబులందెలసి పోందము. రమ్ము.

పాట

వనమాలి వనమాలి । జగదవనాగురుబలశాలి । భజరే ॥వ॥
వనజవిలోచన వరగుణసదనా । దనుజవిమర్దనశౌరి । వరతాపసహృ
దయవిహారీ । ఖలకనకాక్షునిసంహారీ । అలకనకకశ్యపునిగోరనుజీ
రీ । కనికరము సుబల్లదునిగాచిన ॥వ॥

జేయ్ రాంగురు భిక్షాం దేహి

నాగ—ఓహో! కాంతా! ఎవరో హరిదాసులు వచ్చినారు. మనమ్ము ధన్యులము. భాగవతోత్తములారా! వందనము.

నా—సుఖీభవ సుఖీభవ

నాగ—(తనలో) అకట్టా వీరికి కుట్టక్కు పిడికెడుబియ్యమైనను తెకే
కుటుంబుల కుక్కలకు నగ్గు పైపామ్మదము.

మ॥ ధనమూనాస్తిబలంబుసున్న హితులా ♦ తంగ్మార్గ సంచారులా
గనవిద్యాపటిమంబుళక్కి తెలివా ♦ కానంతయుస్ లేదుణే
వనటా నీచము క్షేత్రిమంబర ముగ్నం ♦ బంధుల్ మదీయాంగజుల్
ఘనమేమంచిటు బుట్టజేసెరివినస్ ♦ గంజాసవా భూస్థలిస్।

మ—నాథా! విచారింపకుడు. ఆమహాత్ముల నేసత్కరించిబంపెద.
భక్తాగ్రేసరులారా! తమరాకచే మేముధన్యులమైతిమి. ఒక్క
తృటికాలమిాదు విశ్రమింపుడు. నేనిప్పుడేవచ్చి మిమ్ముల స
త్కరించెద.

నా—సాధ్వీమణీ! యొక్కచోటనున్న మాకు భిక్ష చేకూరదు. పోని
మ్ము మరియొకచోటకు బోయెదము.

మ—మహాత్ములారా! తమరట్లాగయించిన మీమెట్లోపగలము. స
మయముననుసరించి తృటికాలము మిమ్మాప గలసివచ్చినందు
కు క్షమింపుడు. మీారుమాచేతి భిక్షనొల్లకున్న మాజీవంబు
లేల?

నాగ—అయ్యలారా! యాదాముల ప్రార్థన నంగీకరింపకున్న మిాపా
దంబులు విడవారుగారు. క్షమియించి తృటికాలమిాదు
విశ్రమింపుడు.

నా—సాధ్వీలలామా! సరే పోయిత్వరితముగరమ్ము.

మ— చిత్తము. (కట్టెలమోపు గొనిపోవును)

నా—వనితామణీ! ఇవియెందుగొనిపోయెదవు

మ—ఇవి ఈసాహుకారునకిచ్చి మిాకై బియ్యముగొనివచ్చెద.

నా—వద్దు వద్దు మాకీదినంబునచాలినన్ని బియ్యములభించినవి. అవి
వచనముచేసికొన కట్టెలకే వెదకుచున్నాము మాకుచాలిన
కట్టెలనిచ్చిన సంతోషించెదము.

నే నిటే నిక్కముగా బల్కుచున్నదాన. మానవమాత్రుడు గాన ఒకవేళ యేకారణముచేతగాని ఆరాజటని నైశ్వర్యమీ యలేకపోయిన మీరెన్ని కుయుక్తులు జేసినను నేనువాని నైశ్వర్యమిచ్చితీరెద.

నా—(తనలో) ఆ దీన నీమెకుగర్వభంగము కాగలదు. (ప్రకాశముగా) తల్లి ఆగ్రహింపకుము. మీకు తలంచినట్లుప్పటికైన నూ సాగగలదు. మహాత్ములారా! నేపోయివచ్చెదను.

రఘురామా । రఘురామా । పరంధామవిమలగుణ । ప్తోనుభవతర ణనామ । రిపుకదన । భీమదానవవిరామా ॥ర॥ జయజయార్త సం క్షక త్రిభువన । సన్నుతరవికులసోమా॥

(తెరవాలును.)

---

రంగము—కలి కోట.

(కలి, కామ, క్రోధ, లోభ, మోహ, మద. మత్సరులు)

(కూర్చుందురు.)

క—కామ క్రోధ లోభ మోహ మద మత్సరులారా! నాయాజ్ఞ ను బద్దులై నిరంతరమప్రమత్తతతో మీమీవిధ్యుక్తకర్మల నెర వేర్చుచుండిరే!

కా—గీ॥ కచ్చడాగట్టు మునులకు ♦ గామినులన
దవిలి వైరాగ్యపరులకు ♦ ధననిధులన
బంధుహితులకు సుపుత్ర ♦ బంధుగులన
నాసబుట్టించి కుక్కల ♦ జేసినాడ॥

అందునసే ఋషుపటికన్నె యావత్సరంబున జారచోరాప్రమాణుల సంఖ్య ద్విగుణీకృతమైనది.

క—బల్లే! నీ పరిశ్రమయెంతో బాగున్నది. క్రోధా! నీవేమి జేయుచుంటివి.

క—ఓనిర్భాగ్యమా. వేయిమాటలేల. ఇదనిశ్చయమనితలంచుము.

సీ॥ విను నేఁబట్టిన మునఁ జని
యను నీవు వసించు గ్రామము ♦ గమలాసనుఁడై
నను బాగుచేయఁడేని
పసిగొనియును సృష్టి ముంచు ♦ బొల్లుసేసిన్నన్॥

అయినను

క॥ ఎంతటివాఁడు జనార్దను
డంతటి శపథంబుఁజేయ ♦ నేఁగలుగంగన్
పంతమున బోయి నేనిపు
డంతము నొందింతు ద్రాపు ♦ యత్నములెల్లన్॥

నీవు పోయినిర్భయముగానుండుము. అనుచరులారా! మీమీపనుల
ను బహుజాగరూకులై నెరవేర్చుచుండుడు. నేఁబోయివచ్చె
దను. (నిష్క్రమించును)

(తెర వాలును)

రంగము—భిక్షునగరము వీధి

(నాగభూషణము కట్టెలమ్ముచు)

ఏల

కొనరయ్యా మంచి కట్టెలు। చూచి ॥కొన॥ చయ్యన రారండి।
చౌకాబేరము ॥కొన॥ చంద్రమద్దితెప్ప। రెండోజాతి లేదు! యెం
డా తగిలి కాల్లు। మండూ మండెను ॥కొన॥ భారమూ యె మోపు।
నోరుయెండిపోయె। కరుణించి యీపూట। కా భత్యమిచ్చి॥కొన॥

(జనార్దనుఁడు ప్రవేశం)

జ—నిన్న నేఁజూచిన బీదవాడితఁడే. వీనికికొంత ద్రవ్యమిచ్చిన నేదే
ని వ్యాపారముచేసుకొని వృద్ధిబొందగలడు. (ప్రకాశముగా)

ఓహో! ఈకట్టెల నిక్కడ వేయుము. దీనివెలయెంత?

నాగ—ప్రభోత్తమా! దీని నాలుగణాలకమ్ముచున్నాను. మీద

చెప్పిన చిత్తము.

జ—నీకు భార్యాపుత్రులు గలరా?

నాగ—దేవా నాకు భార్యయు పలువురు పుత్రులుంగలరు.

జ—సకుటుంబమైన జీవనాధారము గలదా?

నాగ—నృపోత్తమా! నా పిల్లలు చిన్నవారగుటచే యీ ద్రవ్యమే మాకందరికిని ఆధారమైయున్నది.

జ—పాపము నీస్థితింజూడ నాకు చాలా జాలి గల్గుచున్నది. నీవీ ద్రవ్యముంగొనిపోయి యేదేని వ్యాపారము జేసికొని వృద్ధి బొందుము. (కొన్ని బంగారు నాణెములనిచ్చును)

నాగ—(అందుకొని) ఆహా సర్వేశ్వరునకు నేటికి అనుగ్రహము కలిగినదిగాబోలును. ఇంక నాదారిద్ర్యము తొలగిపోగలదు. ఇప్పుడొక రూకమార్చి భోజన పదార్థములం గొనిపోయెద.

(నిష్క్రమించును)

(కలి ప్రవేశము)

క— ఔరా! నాదాసుని బాగుచేయ నీరాజెంతటివాడు. వీని యత్నములు పాడుచేసెదను.

చ॥ ఇపుడొక పక్షినై యతని ♦ కిచ్చిన ద్రవ్యము గట్టియున్న జీర్ణపు మలినాంబరంబు గొని ♦ రాజును వాచవజేసి వీనిని
న్నృపుల విచార వారిధిని ♦ వేడ్కతో ముంచియు వస్త్రహీనుగా
నపహృత భుక్తుగా సలిపి ♦ యస్మద మోఘ ప్రశక్తి జూపెదన్॥

(నిష్క్రమించును)

(నాగభూషణుని ప్రవేశము)

(పాట)

ధైర్యంబు గలిగెనూ నేటికి నాకు ॥ధై॥ ధరపతి యొసగిన ధన ము
ములాలమున । తీరెను దారిద్ర్యము బాసెను ॥ధై॥ వారిజ నాభుని
కృపగాని నాకీ । యుపకారము జేసెనుగాదా । వరముద మందితి
స్థిరముగ నేటికి । బిరువృషులాసికొను ధారముదప్ప ॥ధై॥

సర్వేశ్వరుని కృపవలన నేను మాపిల్లలు నిముసు హాయిగా భోజనము చేయగలము. మధ్యాహ్నమైనది. త్వరగా యింటికి బోయెద. (పక్షి వస్త్రమెత్తుకి పోవును)

నాగ—ఆహా! ఏమీ మదురదృష్టము సర్వేశ్వరా! ఇంకనూ నీకు కరుణ రాలేదా.

సీ॥ జీవచ్ఛవము వోలె ♦ క్షితి తలంబున నన్ను
బుట్టింపనేలయో ♦ భోగి శయన
బుట్టించినావు పో ♦ పుత్రి కళత్రాది
దుష్ట సంసారాబ్ధి ♦ దోయనేల
ద్రోచినావటె పోని ♦ దొలగని దారిద్ర్య
మారాసి మధ్యన ♦ న్నడచనేల
పడలిసి వదెపోని ♦ ప్రభుచేత ద్రవ్యము
నిప్పించి నాకాశ ♦ బుట్టించ నేల
గీ॥ క్షణములో దానికల్లగా ♦ సలిపి యున్న
వస్త్రమును ధైర్యమును నాదు ♦ భల్య మిట్ట
గోలుపో జేసి పెనుదుఃఖ ♦ కూప మందు
ముంచి క్షుద్బాధ మమ్మిసనే ♦ డ్పించ నేల॥

ఓ జగదీశ్వరా! చిరసహవాసంబుచే దారిద్ర్య దేవతాపీడనంబు నాకంత కష్టముగా దోచకుండెను గాని క్షణములోవచ్చి ఈ ధనము నాకెంతటి వేదనమును తెచ్చిపెట్టినది.

రంగము—భీంపనగరము వీధి.

(నాగభూషణం కట్టెలమోపుతో ప్రవేశము)

పాట

శ్రీ భీమపురా। శ్రీకరులారా। నేనీ కట్టెల। నమ్మెద గానరే॥శ్రీ॥ వరసంబగు ధర। చక్కని సరుకిది। పరికించి చూచి నా। వరాల సమ్మండి॥శ్రీ॥

(జనార్దనుడు ప్రవేశము)

ఏమిది మొన్న నేగదా వీనికంత ధనంబొసంగితి. ఇతడింకనూ కట్టెలనమ్ముట మానకుంపుట కేమికారణము,

ఆ॥ వె॥ కలుగనపుడు తృప్తి ♦ గా దినగోరును
కలుగలోభి తినక ♦ కష్టపడును
ప్రీతిగూర్చి దాచి ♦ పెట్టి మధువురుచి
నెరుగలేని తేనె ♦ టీగపోల్కి॥

దీనికి వీని లోభితనమే కారణము. ఐన నడిగి తెలిసికొనియెద. (నాగభూషణముతో) ఓ యూ! మొన్న నీకంత ధనంబిచ్చియుంటినిగదా మరల నీవీ కష్టజీవన వేల చేయుచుంటివి.

నాగ—మహా ప్రభో వందనము.

పాట

దేవా। యేమందు నాదు। కర్మబంధమునా। యిప్పు॥దే॥ ఎరుగక గతజన్మమందు। నే యపకృతి జేసినానో। అప్పుడు యీ జన్మంబున। అలరి-గుడుపు-చుంటి-నన్ను॥ దే॥ ఆ హరిహర బ్రహ్మదుల। కైనంగానిమ్ము కర్మ। మెట్లయినను భరియింపక-నెపుడు-దొలగ-జాలరు॥దే॥

గీ॥ అబ్ధి బొంగు తరంగంబు ♦ లాపు జేయు
మీరి గర్జించు జలదాళి ♦ నోరుగట్టు

రే ప-ప-ప-ప ॥ప॥ అక్కటకట నా । కాకలి హెచ్చెనూ । అన్న దాత లిలా । నటిదయ్యెర య్యో । బ్రాహ్మణుండ నా । ప్రాణము లూడెన్ । పాలించుము యా । పన్న రక్షకా ప-ప-ప-ప ॥ప

(నాగభూషణం ప్రవేశం)

అయ్యో పాపము. ఈయన యెవ్వరో, ఆకలిబాధ కోర్వలేక విలపించుచున్నాడు. అక్కటా! ఈ వీధి నిండరు ఆగర్భ శ్రీమంతులుండియు యీ యతిథికంత ప్రసాదంబిచ్చి యాదరించకుండిరి.

గీ॥ కల పదార్థంబులెల్లను ♦ గడమ వరకు
మెక్కి బొజ్జలు నిమురుచు ♦ త్రేపు త్రేప్ర
మనుచు త్రేపుచు కూర్చుండు ♦ ధనికులెల్లు
గాంచి గలవారు మాకేంటి ♦ కడుపు చిచ్చు॥

ఆకలిబాధ ఆకలి పీడితునకేయెరుక. మహాత్మా తమరాకలిచే ప్రయాసపడుచున్నట్లున్నది. మెల్లన మా నివాసంబునకేతెంచెదరా.

క—ఓ దయామయా! ఇంతవరకనేకులు నాశ్రమగాంచి పోయిరే గాని, యింత మాత్రపు ఆనందకరంబైనమాట యొక్కడు నూ బల్కరైరి. అయ్యా మీరెవరు.

నాగ—మహాత్మా నేనొక శూద్రజాతుండను.

క— అయ్యా శిష్టాచార సంపన్నుండనగు నేనొక సద్బ్రాహ్మణుడ నీ యాతిథ్యమున కెట్లు లియ్యకొందు. నా ప్రాణంబు లూడుచున్నవి. నీకు నాయందనుగ్రహము గలదేని యీ యుపకారంబు జేసి నా ప్రాణంబులు గాపాడుము.

గీ॥ ధాన్యమున్నది నావద్ద ♦ దాని దంచు
పరికరంబులు లేవు తుష ♦ బాధ మిగుల

కాల్చుచున్నది యివిగొని ♦ కరుణమీాదు
తండులము మూట నరుచేసి ♦ దనుప వలయు॥

నాగ—మహాత్మా అందుకభ్యంతరమేమి. ఇదే మూటంగైకొని వేగిరింబుగా పచనముగావించి మిా క్షుద్బాధ దీర్చుకొనుడు. (ఇచ్చును)

క—(అందుకొని) దయామయా. వందనము. నాకు ప్రాణదానము జేసితివి. నీ మేలెన్నటికని మరువను. యిదే ధాన్యపు మూటంగొని చనుదు. శ్రమ యిచ్చినందుకు క్షమియింపుడు. (ఇచ్చును) (నాగభూషణం నిష్క్రమించును)

క—బలే, ఎట్లనో మాయజేసి యీధనంబుగూడ సహరించితి. ఈ రాజింకేమి చేయగలడో జూచెద. (నిష్క్రమించును)

(తెరపడును)

రంగము—భీంసనగిరము పథి.

(నాగభూషణం కట్టెలమోపుతో ప్రవేశము)

పాట

ఈ కట్టెలమోపు నెవ్వరైన గొనుడి వేఁమించెదు ॥ఈ॥
వేకువ జామున నుండియు । కేక వేయుచుంటి నటులే । ఈ కష్టము కెవ్వరైన । నెంతని యనరయ్యో నేమొ ॥ఈ॥ కరుణాజూడుమో దయాపర । అరయకిట్లు నీదాసుని । పరునిగాగ జంచిబోకు । పరచ-నీకు-న్యాయమూ-నె॥ఈ॥

(జనార్దనుడు ప్రవేశము)

జ—ఆహా! నేనెంత ద్రవ్యమిచ్చిననూ యితడు వృత్తి మానకుండుట వీని లోభగుణమా లేక కర్మ ఫలమా. అయ్యో నాగభూషణ సమీాపించినదే. అయిన వీని నడిగి తెలిసికొనియెద. ఓయీ! మొన్న నేనిచ్చిన మూటనేమిజేసితివి.

నాగ— మహాప్రభో వందసము విూయనుగ్రహంబున ఆదినంబున మాపిల్లలుమేమును తృప్తిగా భోజనముజేసితిమి. మరియుగొంత పరమార్థమునుగూడ స్వీకరించితిని.

జ— (తనలో) ఆహా! వీడామాటలనువిప్పిచూచియే యెరుంగనట్లు వీనిమాటలవల్ల దేలుచున్నది. వీనిభార్య దానిని దాచిపెట్టియుండవచ్చును మంచిది (ప్రకాశముగా) ఓయీ పరమార్థము సంపాదించి నానంటివే అదియేమి.

నాగ— దేవా నేనామాటను మహానందంబు నంగొని పోవుచుండ మార్గంబున

ఆ॥ వె॥ కడుపు వెన్నునంటి ♦ కనుల పాణములిల్పి
చెమటబట్టిమాట ♦ జెప్పలేక
పసిబల త్రుత్తుచేత ♦ బరితపించెడు భక్తి
జనుని గంటి నొకని ♦ జాలితోడ॥

జ—అది వానికచ్చితివాయేమి?

నాగ—ప్రభూ! అతడు కోరిన మంచివని నా బియ్యపుమూట నిచ్చి వాని ధాన్యపుమూటం గొనిచన నాభార్య అవిదంచి పచనముజేయ మేమందరము వమను వేళ్లోల్ల బాగడుకొనుచు తృప్తిగా భోజనము జేసితిమి.

జ—(తనలో)ఛీ! నిజముగా నారదుడు చెప్పినట్లు దరిద్రు నెవ్వరూ బాగుచేయజాలరు. వెర్రినై ప్రతిజ్ఞ జేసితి: ఇతనికెంత ద్రవ్యమిచ్చినను ఆ శనివగాయచే నాబోలును నిలువకున్నది. ఇప్పుడేమి సేయుదును.

ఆ॥ వె॥ తెలియవలయు దనకు ♦ దెలియకుండిన బెద్ద
లెరుక జేయు దాని ♦ నెరుగ వలయు
దివ్వెచేత బట్టి ♦ యెవ్వరెందు కటంచు
గ్రుడ్డి నడుప గోత ♦ గూలకున్నె॥

ఇప్పుడేమి కర్తవ్యము (యోచించి) ఔను, ఇదియుచితయుక్తి ఎంతద్ర
వ్యమిచ్చిననూ మోసంబునహరించి క్రీడించునా శనిగాడిప్పు
డేమిచేయగలడో చూచెద.

నాగభూషణా. నీవిట్టిదారిద్ర్య మెన్నాళ్లను భవించెదవు

క॥ నెలకగు గ్రాసంబిచ్చెద
జెలువొప్పగ నుండునాదు ♦ సేవక తతిలో
కలిపించెదొలగిపెక్కులు
కలుములు నీకొందవు సచిర ♦ కాలములోనన్॥

నాగ— స్వామీ మహాభాగ్యము. తమకట్టి కరుణగలుగ నాకేమి
లోటు

ఓరీఎవడురా ఇతడుకోరిన పదార్థములన్నియు నకుదినంబు నోసంగ
నేనుత్తరువు జేసితినని మన షరాబుతో చెప్పుము. నాగభూ
షణా. నీవుపోయి కావలసినసామగ్రి నడిగిపుచ్చుకొనుము ఈ
కట్టెలనిందుంచిపొమ్ము (నిష్క్రమింతురు)

(కలిప్రవేశం)

పాట.

ఓరి-ధరపాల-భరమేల-యిదెవినుఁ । గర్వము శిరిజగి బిగిపు దలింతున్।
నేడు-నిను-జూడు-దిన-గూడు-కరువు-జేసెదను ॥ఓ॥ చూడుము నీకా
దినమందునె రాజ్యము। జోద్యముగాగాని శాంతిలుమను! వనమునకు
ను నిన్ను। బనిపెద గనుగొను। మిథ్యాదెనాదగు మగతనమున్॥ఓ॥

శా॥ ఔరా యోరి జనార్దనాంక పశువా ♦ ఔరౌర శ్లాఘాధమా
ఏరా దోమమహాగ్ని పై నురుకున ♦ ట్లీక్షిప్త నాతోడ నే
ధీరత్వంబున బంతగించితివి నన్ ♦ దేహంబు లేకుండ నే
నీరాజ్యంబు గ్రహించి, జూడుమిపుడే ♦ సేనాశకంసించెదన్

ఇక క్షణకాలము ఓర్చుకొనుము—ఇతడెవ్వడేదిగోరిన నిచ్చెదనని శ
పథము చేసినాడు గాన నేనిప్పుడొక ద్విజరూపధారినై పోయి
వానిరాజ్యంబును యాచించిగొని వాని పురంబువెడల ద్రో
చి ఆనాగభూషణునిం గొల్వునుండి తప్పించి ఎప్పటియట్లుం
చెద. (నిష్క్రమించును)

(తెరపడును)

---

రంగము—జనార్దనుని దర్బారు

(జనార్దనుడు మంత్రి.

జ—మంత్రిసత్తమా! ఆదరించువారు లేనప్పుడన్నియుం గష్టములే.
గాని, మల్లికార్జునితో నాపెంచిన దారిద్ర్యముండునా.

ఆ॥ వె॥ ఆకలెరిగి భుక్తి ♦ సంతోష సుఖియించు
వెల్లువాని కెంత ♦ విత్తమిడిన
ఫలము గలుగునంచు ♦ పలుకొంటిని నాగ
భూషణాఖ్య దాస ♦ పోషణమున॥

మరియు, నా ప్రతిజ్ఞయూ నెరవేరినది. నాపిదపమహాసింధ్రుడు వచ్చ
గడువు మూడు దినంబులున్నవి. నాకెంతయో సంతోసం
బొంగ కూడినది

(తెరలో)

క॥ శ్రీరాజ రాజపుత్రా
నీరేజ హితాన్వయాబ్ధి ♦ నీరధి చంద్రా
దారాధర వితరణ జల
ధారా హత దురితజాల ♦ ధారుణిపాలా!

జ—ఓరీ యెవడురా? ద్వారమునందుండి మమ్ముస్తోత్రముజేయు
వారెవ్వరో యిటు తీసుకొనిరమ్ము.

(కలిప్రవేశము)

పాట

శ్రీ। సరసిజ హితాన్వయాబ్ధి ! చంద్ర గుణసాంద్రా । మహాత్మా।
శ్రీ॥ జననాథా । నీకు సరియేగీ కీర్తికి । లోకములు సలతీ । నీకీ
ర్తిణ । ఆశ్రితాళిని గా పాడు వా । రెవ్వరీ వసుధణ । మహా
త్మా॥శ్రీ॥

జ— భూసురవర్యా! తము రరుదెంచిన కార్యంబేమో యెరిం
గింపుడు.

క—రాజచంద్రమా! భవదీయ నిరుపమాన యశఃకాంతి చంద్రి
కలు దిగంతముల వ్యాపించ గన్గొని తప్పక తమవలన
నా యభీప్సితంబు నీడేరునని కొండంతయాసతో నరు
దెంచితి. మరియు నేగోరునది తమకంత గొప్ప కార్యము
కాదు.

జ—మహాత్మా! శలవిండు. అదెట్టిదైననూ సందేహము లేక నో
సంగెద.

క—రాజచంద్రమా! దాతలలో పలురకంబులుండురు.

సీ॥ ధనము గడుపకుండ ♦ తరుచు నూకలు జీవు
లకు వోసి దాతనం ♦ చొకడు దలచు
డంబ మొప్పంగ నే ♦ డాది కొకొక్కమారు
యన్న దానము జేసి ♦ యలరునొకడు
తమకు వెక్కన పదా ♦ ర్థముల దానము జేసి
త్యాగినం చొక్కడు ♦ తలచు నిక్క
నోట నిచ్చెదనంచు ♦ నోటి చేయిని జూపి
వంచించి తానంత ♦ సించు నొకడు

గీ॥ ప్రజ్ఞకై యిచ్చి దైన్యత ♦ వగచు నొకడు
ప్రాణ ధనముల నర్పించి ♦ ప్రబలునొకడు

జాలినిపోయి మానవుఁడ ♦ సాధ్యపు పెఱనుడి క్రుంకినట్లుగ౯॥

జ—భర్త్రాగ్రేసరా! నీకతంబున నాకిసుమంతయుం గీడు గలుగక పోవుటయేగాక మహత్తరమైన యుపకారము జరిగినది. వినుము.

సీ॥ నేను గూసినగాని ♦ నెర్రి తెల్లవారదం
చని కుక్కుటము గర్వ ♦ మందినట్టుల
యేసక్తముగ రాక ♦ నెవరికార్యము గాద
టనుచును గోమాయు ♦ వనిన యట్టుల
యేను లేకున్ననీ ♦ మానవుల్జీవింప
గలరె యంచని వైద్యు ♦ డలిగినట్టుల
మామతస్థులెగాక ♦ భగవదనుగ్రహ
మందలేరని మూఢు ♦ లనిన యట్టుల
గీ॥ ప్రజల దారిద్ర్య ముడుగదే ♦ ప్రభునివలన
టనుచు మత్తతచే దేశ ♦ నలతిజేసి
కండ్లుమూసుక తిరిగినీ ♦ కారణమున
డధ్యమెరిగితి నాజన్మ ♦ ధన్యమయ్యె॥

ఇదియే నాకు మోక్షసామ్రాజ్య సాధనంబు. స్వప్న సదృశములగు నైహికసుఖంబులకెంతయు నేనాశింపను. ఎవరి కర్మవార లనుభవించవలెనుగాని, యొకరి కర్మకొకరు కర్తలుగారు. గాన నింక విచారింపక మీరుండుడు. దైవానుగ్రహంబున్న నెన్నటికైనను గలసికొందుము. నే బోయెద.

(నిష్క్రమించును.)

క—మంత్రీ! ఈరాజు తెలివిమాలి దాన ధర్మాది దుర్వినియోగంబుల జాలధనము వెచ్చించినాడు. మరిలనది పూర్తి యగువరకు నౌకరులు మొదలగు పలుగతుల వ్యయములను తగ్గించ

మహాత్మా! తమకు బాగుగ శలవిచ్చితిరి. వెఱ్ఱినై యిట్లుబల్కితిగాని. స్థానాధికార భ్రష్టుండనగు నామాటలెవరు విశ్వసింతురు— మంత్రివరా! ఇంతటినుండి యీభూసురతిలకుడే మీకుప్రభువు. నావలె వారినిమిగుల భక్తిగొలచి సుఖింపుడు. మేమిప్పుడే అరణ్యంబుల కేగుచున్నాము నాగభూషణా! నీకితఱుచున దరిద్రుని మానవమాత్రుండు బాగుచేయజాలడను యంశమును దెలసికొంటిని గాని నీకష్టమీడేర నందులకై మిగుల చింతించుచుంటిని. సర్వేశ్వరుండెన్నటికైననూ కరుణించకపోడు. ఇకమీరుండుడు నేబోవుచున్నాడ

పాట

డైలాగ్

మం— పరికిన్ ఇటనిల్వగలనునే ॥నే॥ యికమిము జూడక నొకత్రుటి
యైనను ॥నే॥ సదమల కరుణాంత రంగనమనీ । సన్నిధినుం
చుక సాక కనిటిదయ । వదలిపోవుటది తగదునుగుణనా ।
వందనములు గాని వెనుగొనిపోవుము ॥ప॥

జ— మంత్రినివిట్లు బల్క మానుమీతరిస్ । రూఢిగాను మీకుమా
కు । రుణముచెల్లెగా । కంటనీరు బెట్టవద్దు కర్మదప్పకొనద
రంబె।

మం— అక్కటా యికేదిదారి । అయ్యో యొంతజేసెనువిధి ॥యే॥

నా— మహాత్మా! తమరరణ్యంబుల నిడుములుగుడుచుచుండ నేనింటహాయిగా నుండుటకన్న పాపంబుగలదే మరియునీపత్తునకు నేనే కారణము.

ఉ॥ పలికమీరు నాదశక । దెంతకొంజితిలి మేలుసేయగా —
జాలిగలంచి మీమదిని । సాంద్రవిపద్దశ నొందినారుహా
కూలి ప్రవాహవేగమున । గొట్టకపోయెడు మాషికంబుపై

జాలినిపోయి మానవుఁడ ♦ సాధ్యపు పెక్కసుడి కృంకినట్లుగ॥

జ—భక్తాగ్రేసరా! నీకలెంబున నాకిసుమంతయుం గీడు గలుగక పోవుటయేగాక మహత్తరమైన యుపకారము జరిగినది. వినుము

సీ॥ నేను గూసినగాని ♦ నెరి తెల్లవారదం
చని కుక్కుటము గర్వ ♦ మందినట్టుల
యేసద్గుణము రాక ♦ నెవరికార్యము గా ద
టనుచును గోమాయు ♦ వనిన యట్టుల
యేను లేకున్న నీ ♦ మానవుల్ జీవింప
గలరె యంచని వైద్యు ♦ లెంచినట్టుల
మామతస్థులెగాక ♦ భగవదనుగ్రహ
మందలేరని మూఢు ♦ లనిన యట్టుల
గీ॥ ప్రజల దారిద్ర్య ముడుగదే ♦ ప్రభునిపిలన
టనుచు మత్తతచే దేవు ♦ నలఁ జేసి
కండ్లుమూసుక తిరిగిని ♦ కారణమున
దధ్యమెరిగితి నాజన్మ ♦ ధన్యమయ్యె॥

ఇదియే నాకు మోక్షసామ్రాజ్య సాధనంబు. స్వప్న సదృశములగు నైహికసుఖంబులకెంతయు నేనాసింపను. ఎవరి కర్మ వారనుభవించవలెనుగాని, యొకరి కర్మకొకరు కర్తలుగారు. గాన నింక విచారింపక మీరుండుడు. దైవానుగ్రహంబున్న నెన్నటికైనను గలసికొందుము. నే బోయెద.

(నిష్క్రమించును).

క—మంత్రీ! ఈరాజు తెలివిమాలి దాన ధర్మాది దుర్వినియోగంబుల జాలధనము వెచ్చించినాఁడు. మరిలనది పూర్తియగువరకు నౌకరులు మొదలగు పలుగతుల వ్యయములను తగ్గించ

వచెను.

మం—చిత్తము.

క—నాగభూషణా? ఇక్కడనే నీకేమిచ్చుచున్నారు.

నాగ—మహాత్మా! నాకుటుంబమునకు గావలసిన గ్రాసంబంతేయు
నిచ్చుచున్నారు.

క—అబ్బా. ఏమీ యవివేకము. ఓయీ! ఇంకనావెఱ్ఱి జనార్దన
ప్రభుత్వముగాదు. నీకంతసామ్ము నెచ్చింప మేమిష్టపడము.
నీవింతటినుండి యుద్యోగంబునకు రావలదు. పొమ్ము.

నాగ—చిత్తము.

గీ॥ కామలోభాది కలుషసం ♦ కలితుడైన
ప్రభుని గొలచుటకన్న పా ♦ పంబు లేదు
కడగి గయ్యాళి భార్యతో ♦ గాపురంబు
కన్న దుర్ఘటమౌ సరి ♦ కింబు లేదు!

గాన నిందుండి దొలగుటయె మేలు. ఆసర్వేశ్వరుండేదిక్కు.

(నిష్క్రమించును)

(తెరవాలును)

(నారదుడు తెరముందుకువచ్చి)

అక్కటా! ఎంతపనియయ్యె. ఏమీ యీకలిప్రభావము.

క॥ తనదాసుని శిక్షింపగ
బనివడి యీప్రభుని రాజ్య ♦ భ్రష్టునిజేసెగా
యినుమును వంచగ దలపడి
యనలుని మర్దించినట్టు ♦ లన్యాయముగా!

అయిననూ దైవమేకీభవించకుండ నీకలివమ్మాత్రమేమిచేయగలడు. అ
తనికంటియున్న గర్వంబును భంజింప సర్వేశ్వరుండిట్లు గావిం
చియుండును. ఇంకనతడు కళంకరహితుండై యచిరకాలంబు

నం కైన పన్నగబంధి సుఖింపగలడు. ఈవార్త లక్ష్మీనా
రాయణుల కెఱింగించి ఎట్లయినను జనార్దన నాగభూషణుల
నుద్ధరింపజేయగాక. (నిష్క్రమించెను)

రంగము—వైకుంఠము

(నారద లక్ష్మీనారాయణులు కూర్చుందురు)

ల—నారదా ఇట్లు జరుగుట కేమికారణము.

నా—అమ్మా! ఈకారణంబులన్నియు నెవరెఱుంగగలరు.

సీ॥ కలిమి లోభియింట ♦ కాపురముండుట
దాతను నిరసించి ♦ తన్ని చనుట
గురుపాప నూరువ ♦ త్సరములు బ్రతుకుట
నఘ విహీనుని కాయు ♦ వల్ప మగుట
ఖలమతునకు సౌఖ్య ♦ గరిమ ప్రాప్తించుట
కడుమంచి వాడెప్డు ♦ కష్టపడుట
నిర్ధనికునియింటి ♦ నిండ బిడ్డలునుంట
పర ధనాధిపు భార్య ♦ వంధ్యయౌట
గీ॥ తాను కోరిన ఫలితంబు ♦ దప్పుచూట
గోరుకొననట్టి ఫలమొన ♦ గూడుచుంట
జూచుటతొగాని యెవ్వరైన ♦ జోద్యమొప్ప
గారణంబిట్టిదని చెప్ప ♦ గాదరంబె॥

అది నీనాథునకే యెఱుక.

వి—నారదా! చివరకేమైనది.

నా—ఇట్లుండ నొకనాడొక భూసురుండరుదెంచి యాచనపూర్వకం
బుగా నారాజ్యంబు గ్రహియించి నాజనార్దను నరణ్యంబుల
కంపి యానాగభూషణునిం గొల్వునుండిమాన్పింప నాతడప్పు

టియట్ల గట్టిలనమ్ముకొని జీవించుచుండె.

వి—(నవ్వుచు) నారదా చివరకేమి మాట జెప్పితివి. నిమిషము లో ప్రమోదంబునందేలు మాయిందిర మనంబును వికలంబు జేసితివే. పాపమాతని దారిద్ర్య మాతనినింజుట్టుకొనెన గాబోలు. కమలా! నీదాస్యనైసంగాపాడలేక పోయితివి. అక్కటా! సిమాంట సాగనంపుల కెంతయో విచారించుచున్నావే

నా—మహాత్మా! తమ రనుగ్రహింపకున్న నెవరిమాటయు సాగ నేరదు.

పాట షైలాగ్

ల—కరివరదా న! న్నిరసనతో డక | పరిహాసంబుక | మరి మరిజేయక | పలదిటు వనుగనుమా॥

వి—వనజాక్షి కోపమదేలా | వలదన్న వింటివే బాల ॥

నా—ఒకరి సొమ్ముకో | వోపుగెల్పులు | పరిభవమేలా సంతోంబు నకుక ॥

ల—వినను నే | విడచెద నే | స్వయముగ నే | నిచ్చెదకలిమిక ॥క॥

వి—ప్రాణేశ్వరీ! దీనికై నీకింత పట్టుదలయేల. పోనిమ్ము. ఎవరు గెలిచిన నేమి. నీకగునష్టమేమున్నది.

ల—ప్రాణేశ్వరా! ఈనెపంబున నన్నుప్పుడెత్తిబాడచుచుండవచ్చునని యూహించుచున్నారు. మీమాయలు నే నెరుఁగుదు. అపకీర్తికన్న నధమంబేమున్నది.

ఆ॥వె॥ పూని యొడలి చిన్న ♦ పుండు బుట్టినపుడె
మందుబోసి మొదలు ♦ మాన్పకున్న
పడని వస్తుచయము ♦ భక్షించినపుడెల్ల
సెలలు వేసి బాధ ♦ కలుగుచుండు॥

కావున,

ఉ॥ ఏటికి కేళిజేసెదరు ♦ యిందిరవాక్యమమోఘమంచు, నే
జాలెద నాడెయానృపతి ♦ సాధ్యము దప్పిన నేనెవ్వానికి
న్నేటి ధనంబు గూర్తునని ♦ మీ సముఖంబున బల్కియుంటి నా
మాట దొలంగివాని ఘన ♦ వంతున్నోనక్తు గ్రిమాసకాలముల్।

గానవాకు సెలవొసంగుడు.

వి—సరే. నీకట్టి పట్టుదలయున్న నట్లనేజేయుము. ఆపరాభవము మేమేపొందెదము.

ల—నన్ను జూచినకాలది మీరాక్షేపించుచునేయుండెదరు. నే బోయి నాప్రయత్నము జేసికొనెద, (నిష్క్రమించును)

వి—నారదా తనమాట వోటుబోయెనని యిందిర మహాతీవ్రంబున బోయినది. ఏమిచేయున్నో.

నా— దీనరక్షకా! తమరదృష్టమును బ్రసాదింపకున్న నెవ్వరేమి జేయగలరు.

వి— సరే. ఈసారి సంపూర్ణముగా లక్ష్మికి గర్వభంగముగాగలదు. నీవ్వింక పోయిరమ్ము.

నా—

పాట

హరి హరి కరివరదా । ముకుందా । ఆర్తజనావన । ఆదినారాయణ । అభ్రగపతి గమనా । శ్రీరమణా । అభ్రగపతిగమనా॥హ॥
కనకచేలా । ఖలహృత జాలా । కలుషాంతక సక । లావని పాలా ।
భక్తపోషా । పరమ పురుషా । బహుకృత ఘనవేషా । ఓ దేవా !
బహుకృత ఘనవేషా ॥హ॥ (నిష్క్రమింతురు)

తెరవాలును

రంగము—అరణ్యము.

లక్ష్మి ప్రవేశము.

పాట

ఎటులిక దాచెదనో గదా నా । ప్రాణ విభునితో నని పం దెమునే॥
నె॥ సంపూర్ణుడు భూ । త హృదయవాసుడు । చంద్రిది నేశ వి
శాల సునయనుడు । పలికిన నుడువులు । పాటి యొనర్చక । ఎం
దుల కిటునే । నెదిరి బల్కితిని । నాగతి యిక నెటులగునో । సరపతి
రీతిగ నాకపునేమో ॥ఎ॥

ఇప్పుడు నావలన గాదనిన యింతకన్న మానహాని లేదు. ఏ
మైననూ సరే. తగినంత కృషిని జేయక విడచుట యు
క్తమముగాదు॥

క॥ ఎదిరి బల మెఱుగకుండగ
గదనము బ్రకటింపజేయు • కంటె జడంబుల్
మిడిమున దలపడికయ్యము
వదలి పలాయనము కంటె • వంచన గలదే॥

అదుగో. ఆదీశభక్తుడిట్లనే వచ్చుచున్నాడు. ఇప్పుడేమి కర్తవ్యము
ఔను, ఇప్పుడొక ధనమువూట నీ మార్గంబునందుంచితి
నేని యితడది గ్రహించగలడు. శిరివచ్చుచున్న మోకా
లడ్డువారెవరు.

సీ॥ కులహీను కృటిని స • త్కులవంతునిగ జేయు
బలహీనునకు భూరి • బలమునిచ్చు
నజ్ఞాని నంతలో • సుజ్ఞానిగా జేయు
మందుని సభకు భా • షందు జేయు
మర్మవాదిని మేటి • ధర్మవాదిగ జేయు
పాపి కురూపి సు • రూపి జేయు

సవివేకి సద్గ్రాస ♦ నాధి పత్రిగజేయు
వింత తస్కరు గార ♦ వంతుజేయు

గీ॥ నిట్టి మహిమ జెల్వగెడి ♦ యీ ధనంబు
గాంచి మదిరోయు వారలు ♦ గలరె భువిని
మున్ను కురుపాండవులు తమ్ము ♦ లన్నలైన
నాకొరకు గాదె కలహించి ♦ నాశమైరి॥

గాన, యీమూటనిందుంచి నేనీ చాటుననుండెద. (అట్లుజేయును)

(కలి పరివేశం)

ఏమీ యీచిత్రము. ఈ నాగభూషుని స్థితింజూడ నాకెంతయో భయము గలుగుచున్నది.

పాట

మానధనుడు హరి । ధ్యానపరుడు నభి । మానచిత్తు డఘ దూరుడు। డజ్ఞాన హీనుడన । మాన గుణుడు సం । తానపరుడు నాగభూషుణ్డె॥
మా॥ హే! అరుణార్క కిరణ దర్శన తమః పుంజంబు రీతిగ । అరసి గనుగొన శుభ సూచనంబులు నామనంబొప్పచుండెగ॥
ఏమిక జరుగునో । ఏగతి గలుగునో । నామది భీతి । నాటిన దకటా ॥మా॥

(చూచి) అదుగో లక్ష్మీదేవియే స్వయముగా ధనము గొని తెచ్చి యితని కొరకై యే గాబోలును మార్గంబునందుంచి నిరీక్షించుచున్నది ఆహా! వీరందరి కితనియందింత యభిమానమేల గలుగవలె. చూడంజూడ

ఉ॥ ధారుణి శౌమమున్ దనమ ♦ దప్పక వర్షము వచ్చుముందుగా
పారెడు పిల్లమబ్బులు న ♦ పారహిమానిల విద్యుతాదు లిం
పారగ దృశ్యమానటుల ♦ భాసురలీల శుభప్రసూచనల్
వారక దోచుచుండె నిక ♦ బాసి యదృష్టము వచ్చునేమొకో॥

కానిమ్ము. ముందేమి జరుగునో. ఇప్పుడు నేనితనియం దావేసించి యీద్ధసంబంధము కంటజూడకుండా దాటిపోజేసెద.

(నిష్క్రమించును)

(నాగభూషణం కట్టెలమోపుతో)

పాట

ఈ దురితాంబుధి । నెటుల నీదుదునో ॥ఈ॥ పాపము దేమో । స్వేంద్రునియత్నము । పనికి రాదయ్యెనుగా ॥ఈ॥ హరి హరి నేనీ సతిని సుతులనన । వరలిము దుఃఖముతోడన్ । ఏ తెరవు గనక గ్రాసము దినదొరుకక । పరితాపము బడుచుండన్ । వారక నిటువలె । నిరతము గట్టెలు । శిరముగొని తిరుగజాలన్ । అకటకటానే నికమజాలన్ । మురహారీ । గిరిధారీ నే ॥ఈ॥

అక్కటా! ఏమి నాయదృష్టము. నాస్థితిం దలంచుకొన్న నాకే యాశ్చర్యము గలుగుచున్నది.

ఉ॥ కట్టెలు బుట్టినప్పుడును ♦ గూటికి నోటికి దూరమయ్యె నా కట్టెలు బుట్టినన్నటులె ♦ గూడెను నాస్థితి భూవిభుండు మా మొట్ట నెరింగి ద్రవ్యము న ♦ మోఘమునిచ్చిన నిల్వకెప్పుడున్ గొట్టెను తోకబొత్తెనని ♦ కోవిదులన్నటు లయ్యె నక్కటా!

ఓ సర్వేశ్వరా! ఏమినీ పాలనా వైచిత్ర్యము.

క॥ మహీరాజుకు వనవాసము
గహనాంతరవాసి కవని ♦ కాంతత్వంబుల్
రహీవంధునకును ధైర్యము
సహజ సునేత్రునకు భయము ♦ జరుపుదు వహహా!

కేవలము అది నీబలము గాకున్న కన్నులు లేనివారు ఒంటిగా గ్రామాంతరములకుగూడబోవుచున్నారు. నాబోటులు కన్నులుమూసుకొని కొంతదూరమైననూనడువగలరా! అయిన

సందేహమేల. అట్లు నడిచిచూచెద. (కన్నులు మూసు
కొని నిష్క్రమించును)

(కలి ప్రవేశం)

ఓ సింధునందని! ఈకలిప్రభావంబెరుంగక తగుగుపనివచ్చి పరాభ
వంబు చెచ్చుకొంటివి. నిన్ను కన్నెత్తియైనం జూడక నాగ
భూషణుండేగె ఇక సిగ్గుచెచ్చుకొని

పాట

మరలించు కొనుమోసి మ్రుకుతనమూ । మూసికున్న రమ్ము నీత ।
మాపజూతు నిక్కముగ ॥మ॥ విడరాని బాధలెల్ల ! బడజేతు నాగ
భూషు "మ" భామరో నిన్ గనకుండంగా । జనెనని నీమానసమున
నలుగక సిగ్గువిడచి వచ్చితివే । నేపొంచి-బాధించి-వేధించి-సాధించె
దనే। యిక ॥మ॥

అదృష్టము చేపట్టువరకూ నీవెన్ని ప్రయత్నములు చేసిననూ
క్షణమాత్రంబున విఫలము జేయువాడనని యెరుంగి తొలం
గుము. నేనాతని వెన్నంటయే యుండెద.

(నిష్క్రమించును)

(లక్ష్మి ప్రవేశం)

పాట

ఏమని యిక నానాథుని । మోము జూతున్। మోసపోతిన్ । యేమి
సేతునే నాకవమానంబయ్యెనే "ఏ" వాసవాది సుర మానులకైనా ।
హానిమాయ లోకులెంతయు నైనా । మానసముల వర్ణింపగజాలరు ।
నేనెరుగ్గంగా నెంతా । అజ్ఞానిన్ । అపవాదిన్ । నా కవమానం బ
య్యెన్ "ఏ" నాదునేపములను । యెంచకిదే భూ। నాయక గొను
నా వందనమ్ములు నా । గర్వమడంగెను కనికరముంచూ చాలా । నా
పాలా । హృదిలోలా "యే"

ఇప్పుడేమిసేయుదును. ఆ, ఔను. ఇది మంచియోచన. ఇప్పుడెట్లయిన నా బీదవానియింటనొక ధనపు పెట్టెనుంచి నా ప్రాణేశ్వరునికది చూపి విజయమందెద. పిమ్మట నేమైన గానిమ్ము. (నిష్క్రమించును)

(తెరవాలును)

---

రంగము—నాగభూషణం యిల్లు

నాగభూషణం హరిభజన జేయుచుండ

(పెట్టెతో లక్ష్మి ప్రవేశము)

ఇదియే నాగభూషణుని కుటీరము. అతడదిగో హరిభజన జేయుచూ కూర్చున్నాడు. (ప్రకాశముగా) అయ్యా! యీ కుటీర మెవ్వరిది.

నాగ—అమ్మా! నేనొక శూద్రజాతుడ. ఇందునివసించి యుండెదను. తమకు దాహము గావలెనా.

ల—నాయనా! మాది తారకానగరము ఇక్కడికి కొలది దూరమందున్న పర్ణపురంబు మా పుట్టింటికిం బోవుచున్నదాన ఈపెట్టె భారమై మోయజాలకున్నాను. ఎవరినైనం దీసుకొనివచ్చి పట్టించుకొని పోయెద. అంతదనుక నిది మీ యింట నుంచగోరెద.

నాగ—తల్లీ! ఇందేమియున్నదో. మాయిల్లు చూచితివిగదా. దీని నేనెట్లు కాపాడగలను.

ల—నాయనా! ఇందులో కట్టుబట్టలు కాగితములు తప్ప మరేమియూ లేవు. అవియుండిననూ పోయిననూ నిన్ను బాధించుదానంగాను. దయయుంచి నామాట త్రోసిపుచ్చకుము.

నాగ—అమ్మా! అట్లయిన నీవే ఆపెట్టెను ఆమూలనుంచి మరల

త్వరితముగా వచ్చి గొనిపొమ్ము. (అట్లు చేయును)

లో—(స్వగతము) ఇక నానాథునిం దోడ్కొనివచ్చి యీధనమునుజూపి పంతె మీడేర్చుకొనియెద (నిష్క్రమించును)

(కలి ప్రవేశం)

అరేరే! ఏమి యీశ్రీదేవి యవివేకము! ఈధనపు పేటిక నింట నుంచినంత మాత్రంబున నీతఁడైశ్వర్యవంతు డగుననియే కాబోలు. తాను మార్గమందుంచిన ధనంబు కన్నుతెఱచిననం జూడలేదని కినుకనొందక సిగ్గుమాలి పునః ప్రయత్నము జేయుచున్నది. ఈసారి యీధనంబు హరించుటయే గాక వీని నీయూరనుండి వెడలఁగొట్టించెద. ఓయీ! కామక్రోధాది యనుచరులారా! యిటురండు

కా-క్రో- లో—దేవా! ఏమి సెలవు.

క—

క॥ ధరనారిభూషు నింటను
గరమొప్ప సనాతనముగ ♦ గాపుర ముండెన్
స్థిరముగ నా ప్రియురాలా
తరుణికి సువ్వాస మీయ ♦ దలచెను సిరితాన్॥

అందుకొరక ధనపూరిత మందసమాతని యింటనునిచి పోయినది.

కా-క్రో-లో—అట్లనా! మాకేమి సెలవు.

క—

పాట

పొందు పొందూ ఖండితముగన్ । అతి మదమణగింపన్ భూ । సుందర శ్రేదుం డైనంగని । గడ గడగడవణకన్ ॥పా॥ పట్టుడింకన్ । నాగ భూషున్ । పెట్టి నాదేయనుచువడిన్ । కడుజేయుండవ మానము గందరగోళముగన్ । దండనమొన । రించి తన్క । రుండ వనుచు

గట్టియు నా | కొల్వాస వేసుకుపుడీ | కనికారము మానుడీ ||పా౦||

తక్షణంబట్లు చేయుదు. పిమ్మట నే శిక్షించెద,

కా-క్రో-లో—కలి సార్వభౌమా! త్రిలోకభీకరులగు తమరల్గిన యీలచ్చియు గిచ్చియు బిచ్చమెత్తుకొన వలసినదే. ఇదే పట్టి తెత్తుము మీరరుగుడు. (కలి నిష్క్రమించును)

కా—ఎవగోయి నీవు! ఈయిల్లు నీదేనా.

నాగ—అయ్యా! నేనొక దీనభక్తుండను. ఈ కుటీరంబుననే నివసించి యుందును.

లో—పాపము పరధనములపై భక్తినిల్పి యీరీతిసర్వదా కన్నములు పాపుట్కై భజన జేయుచుందువు గాబోలు.

నాగ—మహాత్మా! ఏమట్లనుచున్నవారు.

క్రో—ఈపెట్టె నీకెక్కడిది?.

నాగ—ఎవరో యొక నారీమణి మరలవచ్చి కొనిపోవుదునని యిందుంచిపోయినది.

లో—ఓరి దొంగ. ఇంత ధనముగల యీపెట్టెను నీవుగొప్ప పాహుకారుకనిన్ని, కట్టుదిట్టమయిన గృహంబనిన్ని, యిందు దాచిపోయినదో! దుర్మార్గుడా! నేనెంతయో శ్రమపడి సంపాదించిన ధనము క్షణములో తస్కరించుకొని వచ్చితివి. నిన్ను దయదలంపవచ్చునా.

క్రో—ఇంకాదొంగ భజనలుచేయుచు కూర్చున్నావేమి లెమ్ము ఆ పెట్టెయెత్తుకొని రాజ దర్భారునకు నడువుము. (కొట్టిగెంటును. నాగభూషణ మేడ్చును)

కో—

పాట.

అరవబోకు| వెరువనీకు | త్వరగ నడచిరార ||అ|| దురితుడ ! పర |

ధనము నెటుల । దొంగిలించినావురా ॥అ॥ కలుషాత్మ నీపైకని క

రిమింకమాకు గల్గునే । చండెడమేను । కండలుగను । మొండితన

మునాగునే ॥అ॥

ఇంక నీ వగలేడుపులు చాలించి వడివడిగా నడిచిరమ్ము. నీవెట్లన్ని

కొంపలు వగాపియుంటివో. మహారాజుగారి యెదుట తేలగల

దు (గెంటును)

నాగ—

కీర్తన

అపరాధము నెఱుగనసత్యము । గనుదయగనరే! నేను ॥అ॥ పదములా

త్మలార దీరాకు । శాంతమూని వినినానుడు । వులు పిదప నను

మీ । యిష్టము దీరగగొట్టుడు యేశిక్షనైన ॥అ॥

క్రో— నీదొంగవేషములు నేనెఱుగుదును. ఆపెట్టెను దీసికొనినడు

వుము. (అందరు నిష్క్రమింతురు)

రంగము—భీమనగరము

(లక్ష్మీ నారదులు ప్రవేశం).

ల—నారదా! ఒకవేళ ఆనాగభూషణుం డైశ్వర్యవంతుడై యున్న

నవినీవుజెప్పిన నానాథుండు నమ్మకపోవునేమో

నా—అమ్మా! అట్లునమ్మకుండిన నన్నేలబంపుదు. మరియు నీభర్తగా

రికి తెలియునియంశముండునా

పాట

పరమేశులీల లభి । వర్ణించుటకునిల । నెవ్వారికీతరంబగును ॥ప॥

లోకములను బుట్టించు । లోలతనాడించు । యేకముగ హరియించు

। మెరుగానట్టులనుండు । నెవ్వారికీ తరంబగును ॥ప॥ ॥ప॥ ఆతని

శక్తి పరికాశమున భూతముల ! నన్నిటి నాడించును। అతడెగా సత్వ

రజ స్తమంబు । లపరవీ యీజగమూను । చిద్విలాసుడా సదా । చై

తిన్య స్వరూపు । డెవ్వారికి తిరంబగును ॥క॥

మరియు నీ ప్రాణేశ్వరునకు

గీ॥ అఖిల జగములు గుక్షియం ♦ దలరుచుండు
సతిడె సర్వాంగ యామిర్యై ♦ యమరియుండు
పుట్టి క్షణమున జగమెల్ల ♦ బట్టజేరు
మనసునకు వేగ మశ్వంబు ♦ మప్పనలెనె॥

సీ—కాసంశయము వలదు. రమ్ము పోదము. (నడచి) తల్లీ! ఇదే శ్రీమపురంబు ప్రవేశించితిమి. ఇందా నాగభూషుని కుటీరంబు గన్పించదేమి?

ల—(తనలో) ఓహో. యిది మంచిసూచనయే. నేనొసంగిన ధనంబుగొని మరియొకచోట విశాలభవన మేర్పరచుకొని యుండనోపు! సంతోషముతో! (ప్రకాశముగా) నారదా! అతడిపుడుగూడ నీకుటీరంబున నివసించునా! ఏ సౌధాగ్రంబునందుండెనో! ఇందెవరినైన నడిగి తెలిసికొనుము.

నా—అయ్యా! ఇచ్చట నాగభూషణుండను యొక మహాభక్తుండుండవలయు. అతడిపుడెందున్నవాడు.

పౌరులు—అతడా! అతని భక్తి బైటబడి పరదేశముల బట్టించినది.

నా—అదియేమి.

పౌరు—అతడొక ధనపుపెట్టెను దొంగిలించి యింటిలో దాచుకొన రాజభటులు పట్టి కొట్టి యాధనము లాగుకొని వానినియూరనుండి వెళ్లగొట్టినారు. భార్యాపుత్రులతో నెచటికిబోయినాడో తెలియదు.

నా—నారాయణ నారాయణ యెంతపని జరిగినది.

ల—హా! ఇది నావలన గలిగిన కీడే. తానొకటి తలంచిన దైవంబొకటి దలంచునుగదా. (చతికిలంబడును)

పాట.

ఏమీ కారణము । ఆశ్చర్యమాయె ! హా యీగతికి ॥ఏ॥
హరి హరి మదీయకరుణ । అతనికి కను చేటుగూర్చె । సకల యే
మి సేతుపాప । మయ్యయో! అతడెంత వగచునో ॥యే॥ నను పరి
భవమొందజేసి । నగుటకేమొ నావిభు డిటు । లొకసి జేసి యుండ
నోపు । యేమనందు దేవుని మహిమ ॥యే॥

నారదా. ఇదియేమి పాపము.

ఉ॥ ఆకలిగొన్న వాడను చు ♦ నన్నముబెట్టిన, నాతడాత్రితిః
జోకున నోటబెట్టికొన ♦ జోద్యముమీరగ ముద్దకంఠముః
భీకరవృత్తి నడ్డపడి ♦ మృత్యుముఖంబున కీడ్చు రీతిగా
నా కన్నారసం బకట! ♦ నాశనహేతువె! వీనికయ్యయో

నా— ఆహా! ఇదంతయు కలిమహాత్మ్యముగదా ఎన్నివిధంబుల నెం
దరు వాని బాగుచేయ దలంచిన నొక్కటినిగాడది సాగనీ
యక యెంతపని జేయుచున్నాడు. కానిమ్ము

గీ. వ్రణము రోగంబు పక్వమై ♦ గుణమునిచ్చు
నంతకాలంబు బనిజూప ♦ వౌషధములు.
కర్మ పక్వంబు గానంత ♦ కాలమునను
జేరి మెలెంచ గీడుగా ♦ మారుచుండు

తనలో) అతనికి కర్మపక్వము ఈమెకుగర్వ భంగము నయినది. అ
తడిక శీఘ్రకాలంబుననే నారాయణ కృపంబడసి అఖండై
శ్వర్యమున గుల దూగగలడు. (ప్రకాశముగా) అమ్మా ఇ
కమనము వైకుంఠంబున కేగవలము రమ్ము

పాట కైలాగ్

ల— ఇక నెట్లు జూతునక్కటా । నాథుని మోమిప్పుడో నారదా
॥ఇ॥ మోదంబునన్నవచ్చి । ఖేదంబునన్ బోవ మోమందు

లె యు చెగా। బ్రహ్మనామోమునందు నిక్షయించెగా ॥క॥

నా— తిరిశాక్షి యిట్లుచింతగొన సా। గ్గక మేమి యిప్పకమ్మరో।
జల్పనాస్థకి మేమిటాఫుడమ్మరో ॥తె॥ కనకాంగినిపల్ల గాసిం
చునేను అలనాడె జెప్పలేదా। అమ్మరో అలనాడెజెప్పలేదా

ల— కేట్టా!

చ॥ కనులకు సంధితెన్ బాణము ♦ గాంచిన చేలునిధిక్కరించి యీ
పనినెరవేర్తు చెప్పవని ♦ పంతము నూనియు వెల్లబోయి నే
జని యెటు సిగ్గుమాలి వస ♦ జాతుని మోమును జూతుసక్కటా
దనరగ గర్వభంగ మహా! ♦ దాపురిమయ్యెనునాకు నారదా

నా— అమ్మా జరిగినదానికై విచారించిన ప్రయోజనంబేమి లె
మ్ముపోదము.

ల— నారదా పతిమాట కెదురాడు సతికిగతి గలుగవలసినదేగాని అ
న్యాయము గా నాచే నానిర్భాగ్యునకు దేహాశ్రమ స్థానభ్ర
ష్టత్వము. గలుగుటకు మిగుల చింతించుచున్నాను. నాయెడ
పంతగించి దీనుండగు తమభక్తునింగాపాడక యిట్లుబాధింప ము
న్నాధుస కేటిన్యాయము!

నా— అమ్మా! వానికిదియే న్యాయము తాను యెవనియందు కరు
ణారసంబు జలికించునో వానినే గష్టబెట్టును వినుము

సీ॥ శిబికి మోక్షమునీయ ♦ క్షత్తిమిందుననిల్పి
వాని మేనుకండలు ♦ వలువజేసె
బలిని పాతాళాధి ♦ పతినిజేయదలంచి
మిక్కవగాలితో ♦ ద్రొక్కివైచె
రుక్మాంగదునకు సా ♦ రూప్య మీయదలంచి
తనయుని తలవంద్రడి ♦ తరుగజేసె

నంబరీషునిభక్తు ♦ నవని జాటదలంచి
దూర్వాసుకోపాగ్ని ♦ దూగజేసె

గీ. ధరణికుపకారముగ వాన ♦ గురియుకొరకె
వేసవిని భానుడుగ్రుడై ♦ వేల్పుకరణి
తనచిభక్తుల నీపటు ♦ దనువుచుండు
చేయడన్యాయమెన్నడో ♦ సింధుపుత్రి॥

ల— అట్లయిన గౌతసంతోషమే. నారదా! నాకీ పరాభవంబేల కలుగవలె. అఖిలైశ్వర్యంబులిచ్చి లోకంబెల్ల సంతసింపజేయు కలుములచెలినగు నేనీ నాగభూషునింట నిలువలేకుండుట నాకే నాశ్చర్యముగానున్నది

నా— (తనలో) ఇప్పటికి లక్ష్మి గర్వభంగమైనది ఇకనదృష్టముం జూడవలె అందుకు తగిన బీజంబొకటి ఈమె హృదయంబు నంబాతి ఈమెపట్టున నే నారాయణుం డదృష్టమా నాగభూషణునికిచ్చినట్లు గావించెద (ప్రకాశముగా) అమ్మా మగడు కొట్టినభరించవచ్చును గాని సవతిదెబ్బలు సహించుటబహుకష్టము పాపము అట్టిదుర్దశనీకు సంప్రాప్తించినందుకు నాకుమిక్కిలివిచారముగానున్నది

ల (నివ్వెరపడి) నారదా అట్లనెదవేల నాకుసవతియెవరు

నా— ఎంతవెఱ్ఱిదానవమ్మా ఇంతకాలంబునుండియు నీవెరుగవా నీకీపరాభవంబున కేమికారణమో గ్రహించితివా

ల— నాకేమర్మంబునూ తెలియదు. నీపల్కులు నామనంబు కలత పెట్టుచున్నవి. అదియేమో సత్వరంబునం దెల్పుము

క॥ జననీవిను మదృష్టం
బనుప్రియురా లొండుగలదు ♦ యజ్ఞాత్మున కా
వనితామణిగీచిన గీ

టును దాటడు యామెకాప ♦ టుత్వామదేమో

ఆమె యిష్టానుసారము నిస్సుపడిపిచుచున్నాడు. ఈపని ఆమె చేజే

యించి అగారివ మామెకు సమకూర్చ నిట్లు జేయుచున్నా

ము ఇది బహుగూఢము ఇప్పటికిసీ స్థితిందలంచి విచారంబున,

బొరపడి వెల్లడించితినిగాని లేకున్ననిది వెల్లడింపదగిన యంశ

ము కాదు.

ల—

పాట

మేల్ మేల్ నేనెరుగ నీమర్మము । యేకర్మము। నీధర్మము। మే॥

సత్యంబుకోయిది నిత్యంబుకో ।మే॥ నేనుదెలుసుకొంటి । నీపుణ్య

ముననూ । మమ్మరాదు నమ్మరాదు । వాలిముచ్చలన్ "మే"

నా— అమ్మా అందుననేగదా. అదృష్టము చేయవలెనుగాని నివల

న నేమగునని అనేక సాకు లనుచుచువాడు ముందువచ్చి

న చెవులకన్న వెనకవచ్చిన కొమ్ములు వాడిగదా

ల— ఔరా! ఇది యూసంగతి ఆహా! ఏమీ పురుషజాతిచపలత్వ

ము.

క. తనయింట మూల్గుచుండిన

ధనమును దిన లేకబరుల ♦ ధనమునకు చే

పినగత్తి, గులసతిగూటమి

దనుపక గులటను గోరి ♦ దాస్యముజేయున్

మరియు

క. పూరించుదు రిమ్మహితో క్తుల

నూరింతురు సతులకార్య ♦ మొగిదీరినచో

గోకంతగారవించరు

వారాచెద రింగిలాకు ♦ రుసనలంపన్

అన్నన్నా. నైపై కినాపై నెంత ప్రేమ జూపించుచువచ్చె నారదా! ఆ యదృష్టమెందుండునను దానినెన్నడును జూచియెఱుగను.

నా— తల్లీ! ఆమె వాసంబెచ్చటఁదువా!

క॥ సామేనగౌరి శిరమున
నా మందాకినిని గొన్న యభవుని గితి నీ
సామియు నురమునననిను నా
వామాక్షిని జంపుహంతుఁగు వారకనుంచున్॥

ల— నారదా! దానినిజూచుటెట్లు!

నా— (తనలో) దారికివచ్చినది. ఈప్రశ్నకొరకే వేచియున్నాను. ఇదియే మహాబీజమై. జనార్దననాగభూషణుల వైరశ్వర్యమూ యగలదు (ప్రకాశముగా) అమ్మా! నేను చెప్పినటుల జేసిన ఆమెనుజూడగలవు. నీవోడినందులకై మరల నీసుగడునిచ్చు అదృష్టమును బాగుచేయవలెను గాని నీవలన నేమగునని యా క్షేపించును. అప్పుడు మీరాయదృష్టమన నెట్టిదియో నాకు జూపుండని పట్టుబట్టిన బూర్ణము బైటబడగలదు.

ల— సరే! అట్లయిన బోదమురమ్ము. (నిష్క్రమింతురు)

తెరవాలును

రంగము-వైకుంఠము.

(లక్ష్మీ నారాయణ నారదులు. కూర్చుందురు.)

వి— దేవీ! ఈపరాభవంబున కేమిలే విచారింపకుము. ఇదిమున మువ్వురముదప్ప మరెవ్వరు నెరుగరుగదా పాపము నీయ నుగ్రహామతనికి దేహక్లేశమయు స్థానభ్రష్టత్వంబున్నుంగూడ గలిగించినదిగదా!

నా— మహాత్మా! తెలియక మోసపోయి ఖిన్నయైయున్న మాయ మ్మనేల నుడికించెదరు.

నారదా! ఈకార్యమదృష్టము చేయవలెనుగాని నీవలనగాదని యెన్నివిధంబుల జెప్పినను విన్నదా!

నా. - అందువలనేగదా! మీ చెప్పులకు పొల్పడవలసి వచ్చినది.

పాట.

హృదయమేశ్వాహేళి నేలా । మన్నింపుడ సురాల "హ్రా! అపరాధ మున్ క్షమించి । అదృష్టమును జూపించి । చేయించుమా బాగు వాని । చిత్రింబుజూతుగాని "హ్రా!
అటుజేయకున్న మిమ్ము విడచు దాసగాను.

వి— (తనలో) ఓహో! ఈయుపదేశము నారదునికై యుండవచ్చును కాని యిప్పు. వానికెట్లయిన నిక నైశ్వర్యమీయ దలచియే యుంటినిగదా (ప్రకాశముగా) దేవీ! జీవులకర్మానుసరణి సంభవించు సుఖదుఃఖములకే అదృష్ట దురదృష్టములని వాడుమకు దాసినేనట్లు జూపగిలను.

ల— మీమాటలకేమిలెండు పదునాల్గు భువనంబు లొక్కమాఱ గ యశోదాదేవిగారికి కనుపర్చిన యీసుందరాస్య మెచ్చి యదృష్టమునీ యిందిరకుం జూపగాలననుటకెంతయు నాశ్చర్య పడుచున్నదాన. మీరేమి చేసెదరూనరే ఆమెను గనపర్చువరకూ నేవిడచువానంగాన.

వి— ఓహో! నారదా! ఇదేమియసాధ్యపు పట్టుపట్టినది.

నా— మహాత్మా! తప్పదు స్త్రీలపట్టును శిశువులపట్టును కొంచెమెంచుమించు సమానము లే

వి— ఇందిరా! అట్లయిన నా కారుమాసంబులు గడువునిచ్చినచో నాముష్ఠివాని కైశ్వర్యమీయుగా నీకు చూపించెద అంగీకారమేనా!

— చిత్తము నేలోనకు బోయెద

— ప్రియా అదృష్టమా! ఇటురమ్ము

(అదృష్టము ప్రవేశం)

పాట

నాథానన్నిటులేటికి బంచిరి । యో ॥నా॥ నేనేకార్యము నెరప గబోవలె ॥నా॥ గురుతరకృపనను గనిబలుకుడు వినా । కోరికటుల జరుపుదానగా । పరమానందము నొసంగ్ । అనతీయన్ । వలెను దాసురాలన్ ॥నా॥

వి— దేవీ! నీవీతమ్ముల యీలోహపు ఘులికయందుండి యీనారదునితోబోయి తారకానగరంబున మదీయభక్తుండగు నాగభూషునింట నివసింపుము

అ— చిత్తము (ఘులికయందు ప్రవేశించును)

వి— నారదా! ఈఘులికంగొనిపోయి నాభక్తుని వాకిటంబడవైచి. తిరుగనీవు మత్సమక్షమునకుంజనుము

తెరవాలును

రంగము తారకానగర ము-వేశ్యాగృహము

(శ్రీహరి దిద్దుకొను చుండ నరహరి ప్రవేశం)

న— (వంగిచూచి) ఆపాడు ప్రసాదరావు పోయినాడా?

శ్రీ— ఆయనవెళ్లి గంటసేపయినది. ఆయనపేరిన్న నీకంత కోపమేటికమ్మా!

న— కోపమా! వొళ్లుమండిపోతుంది! నీచేష్టలు నాకెంతమాత్రము బాగున్నవికావు నాకడుపునంజెడబుట్టి కులమునకు కళంకము దెచ్చుచున్నావు.

శ్రీ— నేనేమి తప్పు జేసితిని

న— తప్పాతప్పున్నరా! ఆస్తినంతయు బోగొట్టుకొని తినుటకు పిండము లేక యే హోలిశెట్టికొట్టుద్దనో నాలుగుపద్దులు వ్రాసుకొని బ్రతుకుచున్న ఆబాపనపీనుగను యింటికెందు కురానిచ్చెదవు నాకొక చుట్టముకైనా నీయుటకుగతిలేదె' వానివల్ల నే మిప్రయోజనము

శ్రీ—అమ్మా! ప్రయోజనము మాటతరువాత జెప్పెదనుగాని ఆయన యిరువదివేల రూపాయలఆస్తిని మనపాలుచేయుట చేతనే గదా! వానికీదశపట్టినది

న— అదేసిదగ్గరనున్న చదుగుణము గణికాకుల యొూష్య బగు నీజాలియేనిన్ను జెరుచుచున్నది గాకున్న నీసౌందర్యమునకు నీవిద్యకు యుటుండుట గ్రహచారి మేమి చెరుకు ముక్కవ రసంబిచ్చేనని పిప్పినిగూడ గొరవింతురా! అతడుమునకూడకనే కట్టబెట్టెనా!

శ్రీ— ఔనమ్మా! అది నాకుమాత్రము తెలియదా నేనునీకడుపున బుట్టినదాననుగానా! ఇప్పుడతనివలన గొప్పలాభ ముచేకూరనైయున్నది

న— ఏడిచాడు! చచ్చుపీనుగు ఏదోకూయమాటలు జెప్పి నిన్ను మోసగించుచున్నాడు కాబోలును

శ్రీ— కాదమ్మా! అతని షాహుకారేమో మొన్న మేజువాణీలో నన్ను జూచినాడట. అది యెవరు యెవరి స్వాధీనములో నున్నది. ఏమిటీ సంగతియని యీయనతో ముచ్చటించినాడట. ఆసంగతి నాతో చెప్పినాడు. అందుకు వాని నెట్లయిన నిక్కడకు తీసుకొని రమ్మని చెప్పినాను. ఈదినము తీసుకొనివస్తానని చెప్పినాడు ఇదిసంభ

వించెనా అతని యాస్త్రంతయూ మునదే అందుకే యితనికి ఉద్వాసము జెప్పక నిదానించుచున్నాను

న— ఆ! అట్లనా! ఆమ్మా అందుచేతనే గాబోలునే! నిన్న నాయుం రాత్రము అయిదుగంటల వేళ రెండు నాళ్లు మనయింటిముందునుంచి యిటూ అటూ తిరిగినాడు ఆచూపు తా యిటే వుండిగాని అయితే యితడీరింగులో వాడు గాడనియుపేక్షించితిని.

శ్రీ—తండ్రి చనిపోయినతరువాత యిప్పుడె కొంచెము మారుతూ వున్నదట. పడమటివీధిలోయున్న చింతామణి మహా పొడుపులు వేస్తున్నదట.

(తెరలో శ్రీహరీ అని కేకవినబడును)

న—అడుగో ప్రసాదరావు వచ్చినాడు. ఏమిజరిగెనో వీందము

(తలుపుతీయుగా ప్రసాదరావు ప్రవేశ.)

న—నాయనా! వచ్చినావు. వారముగోజులనుంచి బొత్తిగా కంటికి కనుపడడమే లేదు. ఔను. ఈముసలిముండమాట విూకెందుకు.

ప్ర— (తనలో) ఏమీ! ఈదినంబున నింత ప్రేమగా మాట్లాడుచున్నది. దీనికిజడిసియే కనుపడుట లేదు (ప్రకాశముగా) నరహరీ నీవట్లనకొనకుము మాషాహుకారు గారి యింట్లో పెండ్లిండ్లగుటవలన తీరుబాటు లేక రావడము లేదు.

న— ఎవరూ! పోలిశెట్టిగారి యింట్లోనా!

(పొమ్మని శ్రీహరి సజ్ఞచేయును)

న— నాయనా! నల్లముందు వేళఅయినది వెళతాను చుట్టముక్క ఏమయినావున్నదా! (పుచ్చుకొని నిష్క్రమించును)

ప్రి—శ్రీహరీ! నీవీదినంబున క్రొత్తగా గనబడుచున్నావే.

శ్రీ—క్రొత్తవార్తలు దెచ్చినవారికన్నియూ క్రొత్తగనే గనుపించుచు
ను, దానికేమిగాని పోలిశెట్టిమాటయేమయినది.

ప్రి—చెప్పిన నేమిచ్చెదవు.

శ్రీ—నిన్నీయూరిలో నుండనిచ్చెదను లే.

ప్రి—ఊహూ! అదికూడా నీయనుగ్రహమేనా కాదు. నే కోరిన
దిచ్చెదవా

శ్రీ—నాకు సాధ్యమైనవన్నియు నీకిదివరకే యిచ్చినాను. క్రొత్తవిం
కేమున్నవి

ప్రి—అహా! శ్రీహరీ! నీవస్తువులకు ప్రాతతనముండునా.

గీ॥ పసిడికిని ముత్యమునకు ప్ర ♦ వాళమునకు
ప్రాతతనమెప్డు గల్గునే ♦ ప్రాణసాక్షి
అట్టి సద్వస్తు చయమె నీ ♦ యంగచయము
కోరెదను నీయునుందొసగు ♦ గోపపడక॥

శ్రీ—అబ్బా! ఎంతాశ!

ప్రి—(తనలో) ఆయాశయే నన్నింతజేసినది చేయుచున్నది

సీ॥ పిత్రార్జితంబగు ♦ పెన్నిధి సమమైన
యీనాము లమ్మి నీ ♦ యిల్లు గడితి
కండ్లు మూసుకపోయి ♦ యిండ్లు వాకిండ్లమ్మి
వేడ్క నీ నగలకై ♦ వెచ్చబెడితి
నా భార్య మెడలిపై ♦ నగలను దెగనమ్మి
సిల్కు చీరల క్రింద ♦ జెల్ల గడితి
నత్తవారిచ్చిన ♦ యరసంచి రూకలు
నోగి జరుకంత్రకై ♦ దగుల బెడితి

గీ॥ భార్య విడచితి పరవారి ♦ బలుచ నైతి
పరువు రోసితి గూటికి ♦ గరవు పడితి
బొంక నేర్చితి నేటికి ♦ బింకముడిగి
సానికితరుల దార్చంగ ♦ బూనుకొంటి॥

శ్రీ—ఏమి యాలోచించుచున్నారు.

పరి—ఆసించినదానిని మూసిపెట్టిన దోసమగునా గాదాయని.

శ్రీ—పోనిమ్ము. ఇక్కడ నెవ్వరూ లేరుగదా. (అటూ యిటూ
చూచి) మీరాసించినదేమో జెప్పండి

పరి—చుక్కలరాయని ధిక్కరించు నీమోముకొక్కసారి నుక్కవదీర
చక్కగ ముద్దిడనిమ్ము.

శ్రీ—అబ్బా! ముద్దు మూడువేల వరహాలు.

పరి—అట్లనే మూడువేలుగాదు మూడులక్షలు కిమ్మతుగలమాట
జెప్పెదను. ఇష్టమేనా.

శ్రీ—ఊ చెప్పుడురు. (కౌగిలించుచు ప్రసాదరావు ముద్దుగొని)

ప్ర—ఆహా! ఏమిసుఖము. ఇదియే నన్నింత జేసినది.

సీ॥ మరవున సానిగుమ్మము ♦ ద్రొక్కి తేజాలు
సురరాజ పురిగాంక్ష ♦ జూచినట్లు
చలముననైనను సాని ♦ పిలచిదిట్టిన జాలు
కుక్షినిండుగ సుధం ♦ గ్రోలినట్లు
కసినైనసానితా ♦ కాలదన్నినజాలు
మిన్నులపురి జూర ♦ గొన్నయట్లు
ఛీయనినను సాని ♦ సేవజేసినజాలు
నమలబ్రహ్మ జ్ఞాన ♦ మబ్బినట్లు

గీ॥ అట్టియుడనీవె గృపనునా ♦ యంకమందు
జేరిముద్దీయ నాకల్మి ♦ జెప్పదరమె

సాను లంగూడ దప్పను ♦ వానిజన్న
వమ్మ గుడిమీాదనిల్పిన ♦ బొమ్మనుమ్మ॥

శ్రీ— ఇక చెప్పండి అపనియేమైనదో?

ప్ర— ఏమూాను నేనుబూనిన కార్యము జేయకవిడతునా! నీరొట్టినేతిలోబడ్డది ఇప్పుడేవస్తాడు ఇక నీచమత్కారము జూపించుము. కోటీశ్వరుడు (తనలో) వానినిజూచుకొని నాకు ఉద్వాసము చెప్పదుగదా!

(నరిహరిప్రవేశం)

న— అమ్మా! పోలిసెట్టిగారువచ్చి పంతులున్నాడా యనుచున్నారు

ప్ర— అట్లయిన నేనుదీసుకొని వచ్చెదనుండుము (నిష్క్రమించును)

న— అమ్మా! నీవు లోనకుబొమ్ము. నేనుకొంత పూాపిచూపి పంతులును ఆవలకుబంపివేసి నిన్నుబిలచెదను (అట్లుచేయును)

(ప్రనాదరావు పోలిశెట్టి ప్రవేశం)

ప్ర— శ్రీహరీ!

న— అయ్యా! వస్తూవున్నది లోపలదుస్తులు తొడుగుకొనుచున్నది.

ప్ర— నీకూతురు సెట్టిగారు సెట్టిగారని కొట్టుకున్నది. ఇదుగో సెట్టిగారు యికకడుపునిండా భోజనముజేయుమనుము.

న— ఇటువంటి ప్రభువుల దర్శనమబ్బినపుడే మాకడుపులు నిండినవి అయ్యా! ఇలాదయచేయండి

పో— యేంచాను! యేంచాను! యీాగదిచూాత్తేనే సొర్గంలాగుందే!

న— ఆస్వర్గాని కధిపతులు మీారేగదా!

పో—నేనే! నిజంగా! అట్లయితే నీకూతురో!

న—మీారు దేవేంద్రులైనప్పుడు ఆమె ఊర్వసియే.

పో—అబ్బో! అబ్బో! ఏంగొప్ప! ఏంగొప్ప! అట్టయితే అత్తమ్మా నేను దేవేంద్రుడులాగున్నానంటావా.

ప్ర—(తనలో) దేవేంద్రునిమాటబద్ధముగాని, దిష్టిపిడతవలె నున్నావు. (ప్రకాశముగా) నిశ్చయమండీ. ఒక దృష్టాంతము జూడండి ఆదేవేంద్రునకు దేహమెల్లయు గండ్లున్నవి. దానికి బదులుగా మీకు ప్రసూచకపు గండ్లున్నవి.

పో—నిజమేనా. అత్తమ్మా! ఇయ్యేందుకే పుట్టినయ్యంటావు.

న—నన్ను దేహము నాయనా! కూర్చున్నారు కారు.

పో—చాలుచాల్లే అత్తమ్మా యింతబతుకుబతికి గుఱ్ఱామాత్రం మరియా పెరగననుకున్నావు పెద్దదానవునీవు నుంచుంటే నేను కూర్చోటం మర్యాదే!

న—(తనలో) పీడువట్టి వెట్రిముండాకొడుకు అవలీలగానే కొద్దిరోజులలో గుర్గిల్ల పోలిశెట్టి కాగలడు.

ప్ర—పరవాలేదు కూర్చోండి

పో—కాళ్లుకూడా లాగుతాండై అత్తమ్మా కూకోమంటావా కోపం లేదుగందా!

న—అయ్యో! మనకోమనకేంటి కూర్చోనాయనా!

పో—అమ్మయ్యా! (కూర్చుండును) పంతులూ నువుకూడా దగ్గిర కూకో

న—మీరెప్పుడూ? పంతులను విడువరుగాబోలు.

పో—తెలుస్తిదానా! బేమ్మడంటే యేటుమంటోడో తెల్చునా! రాయభారాలు నడుపుతాడు. దగ్గిరుండి పుస్తిగట్టిస్తాడు. గరబాదానం చేయిస్తాడు. యేదో నెత్తినేసుకొని ఏతాపు అరులేకుండా యేంచాగుద్ది

ప్ర— (తనలో) ఔరా! కోమటియుక్తి రాయభారము నడిపినానని నన్నాక్షేపించుచూ వీరిద్దరికి కలిపిన పిమ్మట నెత్తిని కొంగు వేసుకుని నేను పోవలెనట. సరేలే. వీడి జుట్టు నాచేతిలోనున్నది. నన్ను న్యాయము చేస్తే మూడు రోజులలో దివాళా దీయించనా.

పో—అత్తమ్మా! ఇంకా మీయమ్మాయి రాదే.

స—శ్రీహరీ. సెట్టిగారు వచ్చి యెంతసేపైనదే. ఇంకా నీసవరించుకోవడం కాలేదా.

(శ్రీహరివచ్చి తిరిగిపోవును. సెట్టి గబాలున లేచును.)

స— నాయనా! ఏమట్లు యులిక్కిపడితివి.

పో—ఆమె యెవరో గొప్పింటి తల్లి వచ్చింది మర్యాదగావుండదని కంగారు పడి లేచాను.

స—నాయనా! అప్పుడే మరిచినావా? అదేమా శ్రీహరి కాదూ.

పో—ఆ! ఏంటీ! అమ్మతోడే! నన్ను చంపుకున్నట్టే! చేతులో చాద్యం! అబ్బో! అబ్బో! ఏమందం! ఏమందం. ఇటువంటిదాని పాదాలకాడ బడి చస్తేనే మోక్షంగాని కాసీ కెళితే యేముంది. సింగ. అత్తమ్మా! తిరిగి యెళ్లిపోయిందే, జడుసుకుందేంటి.

స—(తనలో) నీ యెలుగుబంటు ఆకారముజూచి జడుసుకొనినన్నూ జడుసుకోవచ్చును. (ప్రకాశముగా) నాయనా జడియుటగాదు తమబోటి గసికులు యిటువంటి చోటుకువచ్చినప్పుడు ఒంటరిగా రావలెనుగాని మరియొకరిని దగ్గరనుంచుకుంటే స్త్రీలు సిగ్గుపడరా.

పో—అట్టాగా (తనలో) యీబ్రాహ్మడికి ఫలపుష్పదానం ప్రాప్తి లేదు

గామోాలు (ప్రకాశముగా) సరే పంతులూ నేనిక్కడుంటా
ను గాని నువ్వు యిట్టికిపోయి యింత పిండాకూడు తిని రా
పనివుంది.

పరి—(తనలో) ఓహో! ఇది నాయుద్యానమునకే వచ్చినది. చేతు
లార తెచ్చి పెట్టుకున్నాను. కానిమ్ము. (నిష్క్రమించును).
(శ్రీహరి వచ్చి వారగా నిలబడును)

పో— అబ్బో! అబ్బో! ఏమిగ్రహం! ఏమిగ్రహం! ఇయ్యాల పొద్దున్న లే
చి యెవరిమొకం చూచానోగాని యీామెదర్శనం దొరకింది
నాపాపాలన్నియిమోచనం అయిపోయినియి (తనలో) అత్త
మ్మా! అదేంటి యెట్టిముగం అలాసిగ్గుపడద్దే!

న— ఎబ్బె! మాపిల్ల వట్టివెట్టిబాగులదండి కొత్తవారిన్నిచూస్తే అ
లాసిగ్గుపడుతుంది. అమ్మా! భయము లేదు మన పాహుకారు
గారేనే రా

శ్రీ— నేను రానక్కర లేదు ఆయనకు ముద్దులసాని చింతామణి వు
న్నది.

పో—యేంటి! ఛీఛీ! ఒట్టెట్టుకుంటాను నమ్ము, మాదిగోడు కొడుక్కు
యేగాడ్డి నీతోచెప్పింది. యెనకేటో మూయిట్లో మేజువా
ణీకివచ్చినప్పుడు 12 సార్లుగామాసు చూచాను. అంతేగాని
దానికీనాకూ యేమిసంబంధం. రా యిట్టాకూకో.

న— ఛా! యేమిటమ్మా! ఇటువంటి మహారాజు అటువంటి పోకిరీ
తాగుబోతు ముండదగ్గరకు వెళతాడా! ఆయన కేమికర్మం
డబ్బుంటే కొండమీాద కోతిదిగివస్తుంది లేదా? ఖర్చుపెట్టలే
డా?

పో— యేంటి! అత్తమ్మా నే తెలవకడుగుతాను అది అల్లరిముండే
నంటావు?

సాను లంగూడ దప్పను ♦ వానిజన్న
వమ్మ గుడిమీాదనిల్పిన ♦ బొమ్మనుమ్మ॥

శ్రీ— ఇక చెప్పండి ఆపనియేమైనదో?

ప్ర— ఏమారు నేనుబూనిన కార్యము జేయకవిడతునా! నీరొట్టినేటిలోబడ్డది ఇప్పుడేవస్తాడు ఇకనీచమత్కారము జూపించుము. కోటీశ్వరుడు (తనలో) వానినిజూచుకొని నాకు ఉద్వాసము చెప్పదుగదా!

(నరహరిప్రవేశం)

న— ఆమ్మా! పోలిసెట్టిగారువచ్చి పంతులున్నాడా యనుచున్నారు

ప్ర— అట్లయిన నేనుదీసుకొని వచ్చెదనుండుము (నిష్క్రమించును)

న— ఆమ్మా! నీవు లోనకుబొమ్ము. నేనుకొంత పూపిచూపి పంతులను ఆవలకుబంపివేసి నిన్నుబిలచెదను (అట్లుచేయును)

(ప్రనాదరావు పోలిశెట్టి ప్రవేశం)

ప్ర— శ్రీహరీ!

న— అయ్యా! వస్తూవున్నది లోపలదుస్తులు తొడుగుకొనుచున్నది.

ప్ర— నీకూతురు సెట్టిగారు సెట్టిగారని కొట్టుకున్నది. ఇదుగో సెట్టిగారు యికకడుపునిండా భోజనముజేయుమనుము.

న— ఇటువంటి ప్రభువుల దర్శనమబ్బినపుడే మాకడుపులు నిండినవి అయ్యా! ఇలాదయచేయండి

పో— ఏంచాసు! యేంచాసు! యీగదిచూాత్తేనే సొర్గంలాగుందే!

న— ఆస్వర్గాని కధిపతులు మీారేగదా!

పో—నేనే! నిజంగా! అట్లయితే నీకూతురో!

న—మీారు దేవేంద్రులైనప్పుడు ఆమె ఊర్వశియే

పో—అబ్బో! అబ్బో! ఏంగొప్ప! ఏంగొప్ప! అట్లయితే అత్తమ్మా నేను దేవేంద్రుడులాగున్నానంటావా.

ప్ర—(తనలో) దేవేంద్రునిమాటబద్ధముగాని, దిష్టిపిడతవలె నున్నావు. (ప్రకాశముగా) నిశ్చయమండీ. ఒక దృష్టాంతము జూడండి. ఆదేవేంద్రునకు దేహమెల్లయు గండ్లున్నవి. దానికి బదులుగా మీకు ముసూచకపు గండ్లున్నవి.

పో—నిజమేనా. అత్తమ్మా! ఇయ్యందుకే పుట్టినయ్యంటావు.

న—సందేహమేమి నాయనా! కూర్చున్నారు కారు.

పో— చాలుచాల్లే అత్తమ్మా యింతబతుకుబతికి గుూథమాత్రం మరియూ దెరగనను కున్నావు పెద్దదానవునీవు నుల్చుంటే నేను కూర్చోటం మర్యాదే!

న—(తనలో) పీడుపెట్టి పెట్టేటుండాకొడుకు అవలీలగానే కొద్దిరోజులలో గుగ్గిళ్ల పోలిశెట్టి కాగలడు.

ప్ర— పరవాలేదు కూర్చోండి

పో— కాళ్లుకూడా లాగుతాండై అత్తమ్మా కూర్చోమంటావా కోపం లేదుగందా!

న— అయ్యో! మనకోమన కేంటి కూర్చోనాయనా!

పో— అమ్మయ్యో! (కూర్చుండును) పంతులూ నువుకూడా దగ్గర కూర్చో

న— మీరెప్పుడూ? పంతులను విడువకుగాబోలు.

పో— తెలియదా నా! బేమ్మడంటే యేటుమంటోడో తెల్సునా! రాయభారాలు నడుపుతాడు. దగ్గిరుండి పుస్తిగట్టిస్తాడు. గర్భాధానం చేయిస్తాడు. యేదో నెత్తినేసుకొని ప్రతాపు ఆరులేకుండా యేంచాగుద్ది

ప్ర— (తనలో) ఔరా! కోమటియుక్తి రాయభారము నడిపినానని సన్నాక్షేపించుచూ వీరిద్దరికి కలిపిన పిమ్మట నెత్తిని కొంగు వేసుకుని నేను పోవలెనట. సరేలే. వీడి జుట్టు నాచేతి లోనున్నది. నన్నన్యాయము చేస్తే మూడు రోజులలో దివాలా దీయించనూ.

పో—అత్తమ్మా! ఇంకా మీనాయమ్మాయి రాదే.

న—శ్రీహరీ. సెట్టిగారు వచ్చి యెంతసేపైనదే. ఇంకా నీసవరించుకోవడం కాలేదా.

(శ్రీహరివచ్చి తిరిగిపోవును. సెట్టి గబాలున లేచును.)

న—నాయనా! ఏమట్లు యులిక్కిపడితివి.

పో—ఆమె యెవరో గొప్పింటి తల్లి వచ్చింది మర్యాదగావుండవని కంగారు పడి లేచాను.

న—నాయనా! అప్పుడేమరిచినావా? అదిమా శ్రీహరికాదూ.

పో—ఆ! ఏంటీ! అమ్మతోడే! నన్ను చంపుకున్నట్టె! చేతులో చెయ్యేసు! అబ్బో! అబ్బో! ఏమందం! ఏమందం. ఇటువంటిదాని పాదాలకాడ బడి చస్తేనే మోక్షంగాని కాసీ కెళితే యేముంది. గింగ. అత్తమ్మా! తిరిగి యెళ్లిపోయిందే, జడుసుకుందేంటి.

న—(తనలో) నీ యెలుగుబంటు ఆకారముజూచి జడుసుకోనిసనూ జడుసుకోవచ్చును. (ప్రకాశముగా) నాయనా జడియుటగాదు తమబోటి రసికులు యిటువంటి చోటుకువచ్చినప్పుడు ఒంటరిగా రావలెనుగాని మరియొకరిని దగ్గరనుంచుకుంటే స్త్రీలు సిగ్గుపడరా.

పో—అట్టాగా (తనలో) యీబ్రాహ్మడికి ఫలపుష్పదానం ప్రాప్తి లేదు

గామోలు (ప్రకాశముగా) సరే పంతులూ నేనిక్కడుంటా
ను గాని నువ్వు యింటికిపోయి యింత పిండాకూడు తిని రా
పనివుంది.

పి—(తనలో) ఓహో! ఇది నాయుద్యానమునకే వచ్చినది. చేతు
లార తెచ్చి పెట్టుకున్నాను. కానిమ్ము. (నిష్క్రమించును).

(శ్రీహరి వచ్చి వారగా నిలబడును)

పో— అబ్బో! అబ్బో! ఏమిగ్రహం! ఏమిగ్రహం! ఇయ్యాల పొద్దున్న లే
చి యెవరిమొకం చూచానోగాని యీమొదర్శనం దొరకింది
నాపాపాలన్నియు మోచనం అయిపోయినియి (తనలో) అత్త
మ్మా! అదేంటీ యెట్టిముగం అలాసిగ్గుపడద్దే!

న— ఎబ్బె! మాపిల్ల వట్టివెఱ్ఱిబాగులదండి క్రొత్తవారినిచూస్తే అ
లాసిగ్గుపడుతుంది. అమ్మా! భయము లేదు మన షావుకారు
గారేనే రా

శ్రీ— నేను రానక్కరలేదు ఆయనకు ముద్దులసాని చింతామణి వు
న్నది.

పో—యేంటీ! ఛీఛీ! ఒట్టె ట్టుకుంటాను నమ్ము; మాదిగోడు కొడుక్కి
యేగాడ్ది నీతో చెప్పింది. యేనకే టో మూయిట్లో మేజువా
ణీకివచ్చినప్పుడు 12 సార్లుగామూసు చూచాను. అంతేగాని
దానికీనాకూ యేమిసంబంధం. రా యిట్టాకూకో.

న— ఛా! యేమిటమ్మా! ఇటువంటి మహారాజు అటువంటి పోకిరీ
తొత్తుబోతు ముండదగ్గరకు వెళతాడా! ఆయన కేమికర్మం
డబ్బుంటే కొండమీద కోతిదిగివస్తుంది లేదా? ఖర్చుపెట్టలే
డా?

పో— యేంటీ! అత్తమ్మా నే తెలవకడుగుతాను అది అల్లరిముండే
...నంట్రావు?

న— అయ్యో! అల్లరిముండేనా యీమధ్య పిల్లలమెడలలో సొమ్ము లు దొంగిలించి జైలుకుకూడా వెళ్లివచ్చినది.

పో— ఛీ! అందుకేగామాసు యెదవముండ గొండితడిమేది పోసీ? దానిమాట మనకెంటుకుగాని మీయమ్మాయి కూకోపోతే నాకాళ్లు నొప్పులెడతాంన్నై తన కేంబోటు అందానికా దేవేం ద్రుని లాగున్నానని యిందాక నువ్వే చెప్పావుగందా. ఇక డబ్బుకా యేమెదవ ఖర్చుపెడతాడో రమ్మను (రూకలు మ్రోగించును)

శ్రీ— (తనలో) ఇతని సుభిసయముజూడ నాకు నవ్వు వచ్చు చున్నది.

గీ॥ మరుగుబడియున్న నగలను ♦ దరుచుజూపు
జేబులో రూకలను మ్రోగ ♦ జేయుచుండు
మాటిమాటికి మీసము ♦ ల్మెలుపుచుండు
వేశ్య గాంచిన విటగాండ్ర ♦ వెఱ్ఱితనము॥

న—అల్లుడుగారూ! మీ తండ్రిగారి నాటనుంచి మీగుణము, మీ సాహసము. నేనెరుగనా యేమిటి

(శ్రీహరి తల్లిని పొమ్మని సంజ్ఞచేయును)

న— నాయనా! చుట్టము రమ్మన్నా పుస్నదా?

పో— నువ్వు చుట్టకాలుస్తా అట్టయితే రేపు ఒక పెండి పంపుతాను లే నీయిష్టం వచ్చినట్టు తగలేసుకుందువుగాని యిప్పుడీరూ పాయి తీసికెళ్లి కొను కో. (రూక పారవేయును)

న— అమ్మ చూచా! అయ్యసాహసం నేపోతానునాయనా. అమ్మాయీ! మందమతిగా నుండక అయ్యను సంతోషపెట్టు.

(నిష్క్రమించును).

శ్రీ— అబ్బా! యెంతసేపు జూచినా యీక ట్లెసోది విడిచిపెట్టరు.

మాయమ్మ యెప్పుడావలకు వెళుతుందాయని చూస్తాను దా
నిపోనివ్వరు. రారండి (చేయిబట్టి మంచముమీద కూర్చుండ
బెట్టును)

పో— అబ్బో! యేమానందం! యేమానందం! యెండమునగజ్జైన తేనె
డిగిల్లోసుకున్నట్టు కళ్లుమూసుకుపోతుండై యేదీవొక్కముద్ద
య్యి.

శ్రీ— (మాటదిప్పి తనలో) అబ్బా! పీడముద్దు ముక్కలవ?
నోటివాసన ముక్కలు మాడుచున్నవి. (ప్రకాశముగా)
తాంబూలము వేసుకోనండి

పో— ఛీ! ఎదవాకులు యెనక నాపెళ్లికి మేజువాణీలో కూచుండి
గంపెడాకులు నవిలాను యికారం పెట్టి చచ్చినంతపని జరిగింది
నాకొద్దుగాని కమ్మని ముక్కుపొడుముంది వొకపట్టియినా!

శ్రీ— దీనికితోడు ముక్కుపొడుముకూడానా! నాకక్కర లేదు

పో— మరెందుకాలిసిం? నువ్వుదగ్గిర కూకుంటే నామనసు గాలిలో
తగిలించిన కాటామల్లులాగ నిలవడములేదు సీకేకొ దవలే
దు వొక్క ముద్దియ్యి

శ్రీ— అబ్బా! ఏమీ! ముద్దంటే అంతచౌకగా వున్నదనుకున్నా
రేమి

పో— చౌకబేరమైతే సంతలో కేవస్తది. సరుకునాడెముును బట్టి ఖరీ
దు తేడావుంటదని నేనెరుగనేంటి

శ్రీ— దానికేమిగాని! నిజముగా జెప్పండి? మీకునాయందు భ్రమ
యున్నదా!

పో— యెంతమాట! యెంతమాట! నీదయుంటే యాపారం యెత్తి
పెట్టేసి యింటోదాన్ని యెల్లగొట్టేసి నీపాదాల దగ్గిరే పడి
యుంటా! నమ్ము. తప్పితే మొకానిచెప్పు.

శ్రీ— (తనలో) ఔరా! ఏమి యీకాముకుల పోగాలము.

సీ॥ భార్య పల్కిన మండి ♦ పడెడు పౌరుషశాలి
కసరి దిట్టిన వేశ్య ♦ కాళ్లు మొక్కు
ఆలిని గని సింహ ♦ మట్టుల య్యెడి వాడు
సాని గన్గొన్న మా ♦ ర్జాలమగును
ఒకదీరి తృష్ణైన ♦ భార్యగూడనివాడు
వేశ్య చానడిగట్టు ♦ వృషభమగును
పరస్త్రీ నైష్టిక వృత్తి ♦ గాంచుచుండెడివాడు
వెలయాలిలోగిట ♦ వెట్టికుక్క

గీ॥ పాణిధనమాన ధర్మసం ♦ పదలు హీనలు
సుత సతీ బంధు పితరుల ♦ జూడబోరు
సానులందేమి గలదో దా ♦ సతులకిన్న
తిమకినలమ్మందు దృష్టి భే ♦ దంబె గాక

ఇప్పటికి నాయత్నము బాగుగసాగినది

గీ॥ అరసి నేనిక్క డాక సాలి ♦ పురుగుసగుచు
పట్టియను కటకంబును ♦ బట్టకొరకు
వేడ్క వలపను గూడల్లి ♦ వేచియుంటి
జిక్కినది యీగి; విషమునే ♦ నొక్కకుండు.

(ప్రకాశముగా) దానికేమిలెండి. చింతామణియంటే దానికి మేడున్నది. కావలసినన్ని నగలు అన్నిహంగులూను న్నవిగనుక. అదియెట్టి మర్యాదతక్కువ మూండైననూ మీకు రంభయైనది గాని నాకేమున్నదని వస్తారు

పో— అదుగో! మళ్లా అదేలంటూండా! ముష్టిముండ మూడుసాళ్లు దిగతుడవాలి నీమీదనుంచి నీనెక్కడా అదెక్కడా! అవునేమిటి. ఆముదానికి వ్రన్నంతితేడావున్నది. కాకపోతే మేడుందనా

నీకుమూడోనాటికి కట్టిస్తానుమేడ నగలకేంటి యిప్పుడు కావాలంటే మాయింట్లోవే తెప్పిస్తాను. యేంపడబ్బు లెక్కేంటి. నీ దయుండాలిగాని.

శ్రీ— (తనలో) దారిలోనికి వచ్చినాడు సమయము దాటబెట్టగూడదు. వీనికిప్పుడు కొంచెముసారాయిని బట్టించిన మనమేమి చేయుమన్ననూ చేయగలడు (ప్రకాశముగా) మరచిపోయి నాను వుండండి (పోయి సారాయిబుడ్డీని గ్లాసును తెచ్చిన) మీకొరకై దీనినితీసి బీరువాలో పెట్టి మాటలసందడిని మరచి పోయినానండి!

పో— ఏంటిది

శ్రీ— ఆనందరసమని కొన్ని శ్రేష్ఠమయిన మూలికలతో తయారు చేయబడినది. ఇదికొంచెము పుచ్చుకుంటే మనస్సున కెంతో ఉల్లాసమును. దేహారోగ్యమును. గలుగజేయును. ఇది తమబోటి గొప్పవారు వచ్చినపుడే మర్యాదనిమిత్తము దీని కొంచముగా వాడుచుందుము. కొంచముపుచ్చుకొని చూడండి యెంతానందముగా నుండునో, (గ్లాసుతో యివ్వగా త్రాగి)

పో— ఓక్! ఛీ! యేంటిది కారంగా యికారంగావుంది

శ్రీ— ఔషదము తీయగానుండునా! ఇవిగో! మీకొరకై తయారు చేయించినాను నైజాంపకోడీలు ఇవి పుచ్చుకోనండి వికారముండదు మీకు క్రొత్తగుటచేత అటున్నది. గాని, యింకొక మారుండును

(పోలిశెట్టి తినుచుండును)

శ్రీ— నిజంగా జూడండి! మీదయకొరకు ఎన్నాళ్లనుంచి నిద్రాహారములు లేకుండా పలవరించుచున్నానో ఆదైవమున కెరుక

నా కు మేజువాణీలో మీ చేతతాంబూలమును పుచ్చుకున్నది. రొట్టిముహూర్తమోగాని అదిమొదలు. కబురుపంపితే యే ముంచుకోయును భయం. యేమైననూ గానిమ్మని ధైర్యముజేసి పంతులుతో జెప్పనాను.

పో — అబ్బో! అబ్బో! యేంపేమ! యేంపేమ! నిజంగా! నన్ను చంపుకుతిన్నట్టే! అట్టయితే నీకమ్మిం కాడ కుక్కనన్నమూ లే ఇదునో? పోనీ. గోస్తనది వొడ్డుననున్న పెద్దమేడ నీకిస్తాను తీసుకో!

శ్రీ — మీరిస్తేమాత్రం మీ యూబిడ ఊరుకుంటుందేమిటి.

పో — యేడిసేది యెదనముండ! నాయిష్టం అదెవరువొద్దంటానికి. నీకంతనుమానంగా వుంటే టూపుతెచ్చుకో రాసిస్తాను.

శ్రీ — సరే! మీ ప్రేమ యిప్పుడే తెలుస్తుంది. అమ్మా (పిలచును)

న — యేమమ్మా! (నరహరివచ్చును)

శ్రీ — తక్షణమే మన శేషగిరిని పంపించి. పంతులను సెట్టిగారు త్వరగా రమ్మన్నారని పిలచుకుని రమ్మనుము. (నిష్క్రమించును)

పో — శ్రీహరీ! యింతదాక నీవిచ్చినది. నిజంగా ఆనందరసమేసుమా! అందుకే ఆపేరెట్టారు ఆపకోడీలు యెవరు చేశారోగాని దానిరుచి చెప్పటానికే యీల్లేమ యేదీ! కొంచమియ్యి. (తిరుగతాగును)

(ప్రసాదరావు ప్రవేశం)

శ్రీ —(ప్రసాదరావును చాటునకుబిలచి) ఈ గోస్తనదివొడ్డున మేడ నాకు వ్రాసిస్తానన్నాడు. మీరాలశ్యముచేయక వెంటనే వ్రాసివెయ్యండి. మీరు నాపక్షముండి సహాయమున్ జేయుచుంటిరా! మీకేమీ కొదువ లేదు.

ప్ర — అదే నాకుగావలసినది! షావుకారు దొరికినాడు గదాయని

నన్ను మరచిపోకుండాయుంటే యెంతపనిదైనా చేస్తాను బ్రాందిపట్టించినావేమిటి శవంలాగ పడ్డాడు!

శ్రీ— నేను చేయవలసిన కట్టుదిట్టములన్నియూ జేసినాను. ఇక మీా దేయాలశ్యం. ఇదుగో స్టాంపు.

(పుచ్చుకొని వ్రాయును)

శ్రీ— యేమండో! నిద్రాలేక యెందుకిచ్చితినాయని విచారించుచున్నారా!

పో— యేంటీ! ఆమాట మాయింటిముందు కుక్కకన్నా లేదు

శ్రీ— అట్లయితే దీనిపైన వ్రాలుచేయండి (చేయించును)

(నౌకరు ప్రవేశం)

నౌ— యేమండో! మనవోడలు రత్నసరుకేసుకుని రేవుకొచ్చినియి. నావకార్లంతా వచ్చారు. కప్తానుగారు మిమ్ములను పిలుచుకు రమ్మన్నారు తొరగారావాలి.

పో— ఓరి దీనిముండామొయ్యా! అప్పిడే వచ్చినియ్యా! చరేలే యిప్పుడు రావడానికీల్లేదని చెప్పు!

శ్రీ— (తనలో) ఓహో! మనము కొంత సంపాదించుకొనుటకిది మంచిసమయము (ప్రకాశముగా) నేనుకూడా వస్తానుపదండి ఆరత్నసరుకు చూడవలెనని అభిలాషగానున్నది.

పో—అట్లయితేయిం కే! పంతులూబండికట్టించు శ్రీహరీ! పోదాంరా (నిష్క్రమింతురు) తెరవాలును

---

రంగము—(నాగభూషణుని కుటీరము నారదుడు ప్రవేశం

నా— ఇదే నాగభూషణుని కుటీరము ఇతని కఖండైశ్వర్య మొదవు గాక (ఘుళికవిడిచి చనును)

మ— (వాకిలిచూడ్చుచు) ఏమిది సీసపుగుండువలె నున్నది. ఎందుకిది

పోనిమ్ము. పిల్లలాడుకొనటకైనం బనికివచ్చును. ఈమూలబ డనైచెద (అట్లు చేయును)

(ఘుటికలోని యదృష్టము రూపంబుగాల్చి యింటిలోని దారిద్రమును గని)

అ— ఎవరువీవు.

ద— (వణకుచు) నే-నే-నే-ను. కలుములహారిని.

అ— ఇంకనీ విం దేలనుండెదవు.

పాట-డైలాగ్.

అ— తొలగిచనుము-నిలువదగదు-కులుకులింక సాగవే! హరిభజనల నరగుజనుల! తెరవుగనక మరిలవే ॥తొ॥

ద— వనజాక్షి- యెట్లనైనను। జనదెరవును నెదకెదన్ । కనికర మునను। నొకదినమును। ననునిలువనగ జేయుమా॥

అ— అట్లుపీలుపడదు. నిమిషమైననూ యింకనీవిందుండ దగవు. నీకు తావుజూపుచున్నాను. బొమ్ము.

ద— తల్లీ! అనుగ్రహింపుము

అ— ఈపురంబున తల్పాలపోలిశెట్టి శ్రీహరియను వేశ్యంగూడి దురాచార నిమగ్నుండై మైమరచి యున్నవాడు. నేనందుదొలగితి. నీవేగి వానినాశ్రయింపుము పొమ్ము.

ద— చిత్తము తల్లీ! శలవు దయచేయుము [నిష్క్రమించును]

[అదృష్ట మదృశ్యమగును పల్లివాడు ప్రవేశం]

ఇయ్యాలయేటోగాని యాటకెల్లాసుంటే అన్ని అబ్బెంతరాలే. బుగకోచంయెతికి యెతికి చచ్చాను దానితెల్లిచిగా తరగా మాయింటిది గుహవులగోడి రాముడికిచ్చిందట. సెప్పిందేకాదు. ఓసినీతల్లీ ముండామొయ్యా యేంచేశావేలని రెండుతికే చరికి గ్యాపకం వొచ్చి చెప్పింది అదతెచ్చుకుని యెల్లా

మంటే చద్దికూడు కుక్కతినిపోయింది. యేంచేయినూ! చేస
దానవర్మనాలి ముండామోసిన కూడుగాని మద్దేలతిందాంలే?
పొద్దెక్కిందని వొల్లొట్టుకుని బైటకొచ్చినూత్తే వలకు సీసం
గుండు లేదు, యింక యాటెలాచాగుద్ది! యల్లకపోతే యి
య్యాల యాకాచే, యట్టాచావను. యదవచంచారంగాని.
ఓ పాడుబెమ్మదేముడా! మాయంటోళ్లని యెందుకు పుట్టించా
వు. నీకు మతిలేదా!

పాట.

ఎందుకనిపుట్టించావు బెమ్మదేముడా న ॥న్నం॥ బెమ్మదేముడా
బాబు । తమ్మదేముడా॥యెం॥ లచ్చాధికారులంత । లంచమిచ్చినారనీ
కు । లచ్చికొడుక నాకుయెంత ! కచ్చిపాతం సేశావయ్య "యెం"
యింటిలోఆడోళ్లు । యీధులోఅప్పులోళ్లు । సంతలోపన్నోళ్లు। నా
మినాకునల్లతేళ్లు ॥యెం॥ కట్టుకోను గుడ్డలేదు । కడుపునిండ కూడులే
దు । పట్టుకుందాం చేపలంటె । వలకుసీసపుగుండు లేదు ॥యెం॥

యీయమ్మ నడుగుతాను యాకుంటదో! మాలచ్చిమ్మ గోనూ! మ
నింటో యేదన్నా చీచపుకుండు దొరుకుద్దమ్మా!

మ__ నాయనా? ఇప్పుడే వాకిలిలో దొరకగా ఈమూల పడవైచి
నాను. యిదిగో! తీసికొనుము. [యిచ్చును]

ప__ రచ్చించావు మాతల్లి ఇయ్యాలముందుపడ్డ వాటులో పెద్ద
చాపనీదే [నిష్క్రమించును]

తెరవాలును.

---

[కలి. దారిద్ర్యములు తెరముందుకు వచ్చి]

క__ ప్రియా! నిర్భాగ్యమా! విచారింపకుము. చిరకాలవాసితంబ
గు గృహంబువిడనాడ నీకు ఖేదముగనేయుండును. అయినను

"ఋణానుబంధ రూపేణా పశుపత్నీ సుతాలయాః" అనునట్లు, ఋణముదీరిన వెన్క ఏసంబంధమునూ ఇట్లే విడిపోవును. దీనికై విచారించిన బ్రియోజనంబు లేదు మొదటనుండి యు అనేకలీలనియుం దభమాజంబునుం జూపుచు ననేకవిధం బులనిన్ను వెడలగొట్ట బ్రయత్నించుచుండుటచే నేనువాటిని వారించుచు ఎన్నటికైన మనకు నుద్వాసము తప్పదని యే మనకు కామక్రోధాదులం దొందరబెట్ట వారమితముగా గృషి జేసి మనకు జిరకాలయోగ్యంబగు నెలవు నొకటి తయారుజే సి యుంచినారు.

దా- - నాథా! ఎక్కడ! ఎవరు!

క— ఈపురంబుననే రత్నాలపోలిశెట్టి యనువాడుగలడు. అతని కి వేశ్యాలోలత్వంబున దురాచారములన్నియు స్వీకరించుట బూర్తియైనది. నేనుగూడ నావేసించినాను. అదృష్టమట్టిట్టు గానున్నది, నేడోరేపో ఆపీడవదలిపోవును. నీవందుబ్రవే శించి మునుపటికన్న హాయిగా నుండవచ్చును.

— అటులా! మరచితిని! నాథా! ఇంకసవసిష్టమే లేదు ఆయదృ ష్టమే నేనువానివిడచితి. నివందుబోయి యుండుమని చెప్పి నది.

క— సరి! ఇంకసందేహమేమి !తక్షణంబాపోలిశెట్టి యింటికేగు ము. ఇంక, నాగభూషణుని గన్నెత్తియైనం జూడవద్దును మా!                (నిష్క్రమించును)

(తెరవాలును)

రంగము..... వేశ్యాగృహము

(శ్రీహరి, పోలి శెట్టులుగూర్చొనియుండగా
శేషగిరి తొందరగా వచ్చును.)

శ్రీ— తమ్ముడూ! ఇంతతొందరగా వచ్చినావేమిరా!

శే— బావగారు వెళ్లారేమోయని గుండెలుకవ్వుకుంటు పరుగెత్తుకొనివచ్చాను

పో— నాకోసమే! ఓరిచెయ్యెత్తి మొగమా! అంతతొందరెందుకు కొంచెము మంచినీళ్లు తాగు.

శే— బావగారూ! మంచినీళ్లకేమిగాని మంచిబేరం మించిపోతాందండీ!

పో— యేంబేరంయేటి.

శే— దక్షిణపువీధి కరణముగారి పెరటిలో కాపురమున్న నాగభూషణమనే హరిదాసు దగ్గిర యలక్కాయంత రత్నమున్నదండి.

పో— ఆ! యలక్కాయంతే! ఆడికెక్కడిది!

శే— ఒకపల్లివానికి సీసపుగుండుయిస్తే. దానికిబదులు వాడొకచాపనిచ్చినాడట. దానినిక్కోస్తే దానికడుపులోనున్నదట.

పో— ఛా! అదియే గుండ్రాడాయో! యేటో!

శే— సరిసరి లేండి? గుండ్రాయి యంటారు. ఇంకేమన్నాయంటారు. ఎక్కడెక్కడ వర్తకులు అక్కడేయున్నారు. అప్పుడే యేబది వేలకు సుబ్బిసెట్టిగారు అడిగితే యివనంటూయున్నారు

పో— ఆ! నిజంగా! అట్టయితే లక్షరూపాయిలు యిస్తేమాత్రం దండుగేంటి. నువ్వుతొందరగా వెళ్లి నేనురమ్మన్నానని వాడి

ని బిలచుకురా (శేషగిరి వెళ్లును)

శ్రీ— (తనలో) ఇదికూడా నెప్లయినదూ లాగవేసితినా! కృతఘ్నతరాల నయ్యేదను.

పో— శ్రీహరీ! ఏదీ! ఆనందరసం! అయిపాయి.దేంటి. లేకపోతే తెప్పించూ రెండుబుడ్లు.

శ్రీ— ఉన్నది. ఇదిగో పుచ్చుకోసండి! (త్రాగును)

(శేషగిరి. నాగి.భూషణములు ప్రవేశం)

శే— బావగారూ! ఇదిగో వచ్చాడండీ!

పో— నువ్వేనంటోయి! యిలాగా! యేంటీ! రాయాట, యేదీ! (చూచి) శ్రీహరీ! యిదిచూచా. యీ వాడికేలాదొరికిందో గాని దీనికరీదు యెవడూకట్టలేడుసుమా! యీ లాన్నాళ్లైనా! మాయజేసి దీన్ని కొంటే తొంతెలాబమన్నా వుంది.

శ్రీ— (తనలో) గొ ప్పకొంప్పైన గొల్లవానికేలాభము. (ప్రకాశముగా) మీరుతప్పకుండా కొనండి పోనీయకండి

పో— వుండు! యీవాడికొక బేలేస్తాను. యిదేంటోయి గాజురా యిష్టుకొని రత్నమంటావు.

నాగ—. అందరూ! నాణ్యము జేయుటయీది మీకునచ్చకున్న నిచ్చివేయుడు.

పో— యెవరా తెలివితక్కువపెద్దమ్మ! రత్నమని చెప్పింది!

నాగ— వారినెదుకు నిందించెదరు! మీకు నచ్చకున్న నిచ్చివేయుడు.

పో— కాదోయి! దేనికరీదుదానిదే! పోనీ దీనిబేరుయెంత

నాగ— మీకుకుదరదు ఇటుతెండు

షా— అయ్యో! యేంటోయి! ఆలాశంగారు పడతావే! నీసొమ్ముతి నివేశావేమిటి! పీశ యలాయిస్తావు!

నాగ— అయ్యా! ఆలెక్క నాకు తెలియదు. సుబ్బిశెట్టిగారు యేబదివేలకు అడిగినారు నూరువేలైతేనేగాని యివ్వనన్నాను.

షా— అబ్బో! చాలాఆశవుందే! యవరన్నా నాతోరాడు.

(నాగభూషణం కొడుకు చిరంజీవి ప్రవేశం)

చి— నాన్నా! సుబ్బిశెట్టిగారు తొంభైవేలు యిస్తాను ఇస్తాడేమో కనుక్కుని రమ్మన్నారు.

నాగ— అయ్యా! ఆవల బేరమువచ్చినది, ఇటు తెండు మీకు కుదరదు.

శ్రీ— కానండి మించిపోతుంది.

షా— యేంటోయి తొందరపడతావు! నాకంటే కొనేవాడున్నాడేమిటి. ఆనూరువేలకు నాకు కాయం, రేపురా సొమ్మిస్తాను.

నాగ— అలాకాదు. నాకిప్పుడేకావలెను!

షా— పారిపోతావేమిటోయి! శేషగిరీ! పంతులుని పిలువు

శే— ఇరుగో! యిక్కడేవున్నారు. యేమండోయి! షావుకారుగారు పిలుస్తూవున్నారు (ప్రసాదరావు యెదుటకు వెళ్లును)

షా— పంతులూ! చిటానిల్వయెంతవుంది!

ప్ర— ఏబదివేలు ఉన్నది.

షా— సరే! యియిగో తాళంచేతులు తీసికెళ్లి ఆరూపాయిలున్నూ, తక్కినవి కాసులున్నూ. యితనికిచ్చివేయి (పుచ్చుకొని)

ప్ర— మంచిసమయము చిక్కినది. ఇకవీడిపని దివాళా! తాళములు దగ్గిరుండగనే నేనుజాగ్రతపడవలెను. (నిష్క్రమించును)

శ్రీ— చూడండీ! దీనిని మనమంచముపందిరికి వ్రేలాడగట్టిన నెంతో బాగుంటుందండి!

పో— (తనలో) అయ్యబాబో! కొంప ముంచుద్దిలాగుందే! వొద్దం
టే మర్యాదగావుండదు కొత్తకాతా పైగా నేనంటే పడిచచ్చి
పోతుంది. అయినాక్లొంగ్రమము కోమటియుక్తి చూపిస్తాను అ
బ్బో! యెత్తి మొగమా! యిటువంటి వేయిరత్నాల అందం
నీకుంచి యిచ్చెందుకు. దీనిలోవచ్చేలాభం నీకిస్తే నీవొళ్లం
తా బంగారమవుద్ది.

శ్రీ— (తనలో) పాపము యితనికి ప్రాణసంకటముగా నున్నది.

గీ॥ ధనికులైనను గృహస్థులైన నను దరిద్రు
లైన నెలయూలించంగట నలరియొద్ది
కోరినను లేదలనిబల్క తేరుగాని
యాత్మనొందెడి సంతాప మజుని కెరుక

పో— ఏ! మొగం మూలకుతిప్పావే! కోపమేంటి!

శ్రీ— కోపమెందుకు లేండి పురుషులకుండే లక్షణమేయిది,

గీ॥ తేనె మాటలనూరించి నేనెనీవ
టను చు నమ్మించి మాబోటి యల్పమతుల
వలపుబుట్టించి యవసర ములనుదీర
నీచముగ జూతురీరీతి నీతిదప్పి"

ఇందాక మీరు నోటితో జూపిన ప్రేమంతయు జేతితో జూపవచ్చుసరి
కి మారిపోయినది. దీనిని మాయింట్లో నుంచినంతమాత్ర
ములో మేము మ్రింగివేతుమేమో! మీరే తీసుకొనండి (ఇ
వ్వబోవును)

పో— అబ్బే! వొద్దు! వొద్దు! వొట్టు. నేనట్లాంటోణ్ణే అన్నావు! యిం
క నీదగ్గిరనుంచి పుచ్చుకుంటే మాదిగోడుకొడుకు! నీదగ్గిరుం
టేం! నాదగ్గిరుంటేం!

శ్రీ— స్నేహమున్నంటే! అలాయుండవలె (ముద్దుకొనును)

పో— అయ్యో! అయ్యో! లాబాలు! లాబాలు!

(ప్రసాదరావు ప్రవేశం)

ప్ర— సముద్రములో మనవి యేడువాడలు మునిగినవట టెలిగ్రాఫ్ వచ్చినది మీరొకసారి యింటికిరావలె.

పో— (గుండెలు కొట్టుకొనుచు) ఓడలే! మనవే! నిజంగా! అయ్యో బాబో! కొంపనట్లేట్లో కలిసిపోయిందే! శ్రీహరీ! యిప్పుడేవ స్తాను దయుంచు (నిష్క్రమించును)

ప్ర—(తనలో) ఈముండాకొడు కున్నంతవరకూ యిక్కడ నాపప్పవట్టి దే! వాడెప్పుడూ యీయిల్లువదలడము లేదు వీడిపని దినాళా లోనికి వచ్చినది. షావుకారులందరికి వుత్తరములు వ్రాసి రప్పించి, ప్లయింట్లు చేయించి, వీడిని జైలుకు పంపించకపోతే నేక గణపోర్జిగాను. చూడు నాతమాషా! (నిష్క్రమించును)

(తెరవాలును)

రంగము—వేశ్యాగృహము

(శ్రీహరి దిద్దుకొనుచుండ నరహరి ప్రవేశం)

న— అమ్మాయీ! ఏమిచేస్తున్నావు

శ్రీ— తలదువ్వుకొను చున్నాను!

న— ఇదుగో చూడూ! దక్షిణపువీధిలోనున్న జమీందారు వెంక ట్రాయుడుగారికొమారుడు నీకు వర్తమానముపంపించినాడు. సాయంతరము రమ్మని తిరుగ వర్తమానము పంపినాను. నీవు సిద్ధముగానుండు. చాలాసాహసము గలవాడు. తూర్పువీధి కంజాక్షిబాగంతయు నాయనదే!

శ్రీ— షావుకారుగారు వస్తారుగదా!

న— ఇంకా యెందుకాకోమటపీనుగు! అవతలకి గెంటివేయి!

శ్రీ— అమ్మా! ఆయనమనకు లక్షలుపెట్టినాడు. మన కేమిలోటుచేసి
నారని వారిని గెంటివైచి యీ కక్కుర్తిపని చేయవలయును.

వ— ఇదేనీదగ్గిరనున్న పాడుగుణము! నమ్మితే అదేనమ్మడం. మన
కులానికిదా లక్షణం!

గీ॥ ఒకనినమ్మించి యింటిలో ♦ నుంచియొకని
పెరటిగుమ్మాన నిమ్మని ♦ పిలచియొకని
కొరకు గబురంపె యొకనిని ♦ గోరవలయు
వలపుగానకుండ వలపించి మెలగవలయు॥

ఏమిటో. షాహుకారంటె చచ్చిపోతున్నావు! అయింది! షావుకారు
పనిచతికిలబడ్డది! ఏడువాడలు యేట్లో గలిసినవి. ధాన్యములో
వంపుగవచ్చినది, వడ్డీలో సొడ్డుతగిలినది. మిల్లుల పని సళ్లు
కున్నది. ఉన్నకొక్కము నూడవేసితిమిగదా! ఇంకేమున్నది!
వ్యాపారం యెత్తిపెట్టినాడు తెల్లవారిలేస్తే జప్తులు వారంట్లు
బైటకువస్తే భయము, రత్నాలపోలిశెట్టి గుగ్గిళ్లపోలిశెట్టి అయి
నాడు, ఇంకెందుకా పాడుకట్టె, ఇక్కడనున్నాడని యెవరైనా
వారంటు తెచ్చేనా! మనకప్రదిష్ట

శ్రీ— ఛీ! ఈవేశ్యజాతి యెంతవిశ్వాసహీనమైనది. అందుచేతనేగ
దా యీకులము వారికి.

గీ॥ వసుధ విటకాంత్రులనెడిద్వి ♦ పాదపశుల
లలినివలపించి యార్జించు ♦ లక్షలైన
గాయమొక్కింతవడలిన ♦ మాయమగును
వంశముండదు చావదీ ♦ పమును లేదు॥

ఏమయిననూ సరే! దీ. మాటవినకపోయిన నన్నుబ్రతుకనివ్వదు చె
ప్పుటకు నోరురాదు (తలవంచును)

వ— ఆలోచిస్తున్నావేమమ్మా! నీవుచెప్పలేకపోతే నేనుచెప్పెదనులే!

శ్రీ— నీవుజెప్పవద్దు నేనే జెప్పిపంపెదను

(తెరలో శ్రీహరీయని కేక వినబడును.

శ్రీ— అదుగో వచ్చినారు నీవువెళ్లు (నిష్క్రమించును)

(తలుపుదీయగా పోలిశెట్టి ప్రవేశం.)

(శ్రీహరిపరుండును)

పో— (తనలో) కరణంపిల్లని కాకిపిల్లని నమ్మకూడదని పెద్దోళ్లన్నారా! కొంపముంచేశాడు! చిత్తాలన్నీ తగలేశాడు, నమ్మితా శాలిస్త్రీ సొమ్మంతా కాజేశాడు. యాపారములో నష్టం చూపించాడు, పైగా, అప్పులోళ్లకి పుత్తరాలువ్రాసి ప్రయిమెంట్లు చేయించాడు, ఆస్తిజప్తుచేయించాడు, యికనన్ను పట్టుకోటానికవారంటుపుచ్చుకొని తిరుగుతుండారంట, యెట్టాగో పట్టుకోకమునుపే మళ్లా శ్రీహరిదర్శిన మెప్పుడుకలుగుద్దో యిప్పుడే కళ్లనిండా చూచుకుంటా (ప్రకాశముగా) శ్రీహరీ! యే! పడుకున్నావే! నిన్నమేళానికెళ్లా వేంటి! యింకేం! గజ్జెకట్టుకొని నేనేమా ఆటకత్తెనని గెంతావుకామాసు కాళ్లునొప్పులుచేసినయి. అయ్యో! తెల్లటిమొగమా! వుండూకొంచెము వొత్తుతాను.

శ్రీ— (కసరి) మీరుకాళ్లుపట్టవద్దు వ్రేళ్లుపట్టవద్దు యీనాటితోనుంచి మీకూమాకూ ఋణముదీరిపోయినది పన్నుతాకకండి

పో— అయ్యబాబో! కొంపములిగిందే. ఆబ్రేమ్మడు దీనికికూడా మాత్రేశాడేంటి! ఏంటాకోపం!

శ్రీ— కోపంగాదు నాపాపం నెల్లాళ్లనుంచి యొక్కదమ్మిడైనా మీరివ్వడం లేదు. ఇంట్లోజూస్తే బోలెడుఖర్చు మాఅమ్మనన్ను కోసుకు తింటూయున్నది. అనేకమంది రాయభారములు పంపుతూయుంటే నేనువిశ్వాసము గలదాన్నికాబట్టి బాగుండదనియొ

ప్పకొనడము లేదు. ఇక నాదారి నేను చూచుకుంటాను. మీరావు రావడమునకు వీలులేదు నడువండి

పో— అయ్యో దేముడా కొండనాలికిని నమ్ముకొని వుండనాలుక వూడలాకున్నట్లు నిన్నునమ్ముకొని నాఆస్తంతా పోగొట్టుకుంటే నువ్వుకూడా దగాచేశా! యింకెట్లా బతికేది.

శ్రీ— ఇంతవ్యాపారముకు ఓ నీసానికి యెక్కువాయేమి!

పో— యింతయాపారంపోతే యినసాల్వెంటుంది సాని పోతేచావేగాని యింకేముంది

సీ॥ పాతికవేలు గా • పాయల మేడనే
నిష్టముతో నీకు వ్రా • సిచ్చినాను
నూరువేలుబోసి • చారుమాణిక్యము
గొనితెచ్చి నీయింట • నుంచినాను
లెక్కజూ కనిబ్బ • రొక్కమింతయునీదు
యింటిఖర్చులకే • వెచ్చించినాను
నీవు మోసినయన్ని • నెరిరతినవురగ
గొనితెచ్చి దిగబోసి • కులికినాను

గీ॥ బంధుహితులను ద్వేషించి • బాసినాను
కులము గౌరవములనీట • గలిపినాను
తరుచురుణముల పాలయి • దాగినాను
తొలమినీదయె స్వర్గము • చూచినాను

శ్రీ— నేనుమాత్రము మీకుజేసిన లోటేమున్నది. ఇవన్నియుమీరూగక నాకు గట్టబెట్టితిరా!

సీ॥ చిదిమినబాల్గారు • జెక్కిలిజేనొక్కి
కోర్కెదీరగ ముద్దు • గొనగలేదె
నిరసించురుచుకోపు • మరపించు సుధసావు
జొక్కంపు మోవిప • లొక్కలేదె

పసిమిమించిసిరీ వ ♦ కుసుమకోమలమేను
గసిదీరి కౌగిట ♦ గట్ట లేదె
రాజిలంబైన నా ♦ లేజవ్వనము మీరు
నొంచ మద్ధనల ♦ యించ లేదె
గీ॥ కూర్మి నా సేవహాయిగా ♦ గొనగ లేదె
పదిలముగ కొంచవ మును ♦ నింపాబదుస్తు
లలర, చకమూలవనేర్చి ♦ వలవుజూపి
పరులపాల్జేయు టీ బ్బు ♦ కొరకుగాదె
[వారంటుజవాను ప్రవేశిం]

బం— శ్రీహరీ పోలిశెట్టగారున్నారా!

పో— (కంగారుతో] అయ్యబాబో వారంటుజవాను గామాసు! లేర నిచెప్పు లేరనిచె్పు. నీకాళ్లకుదండం పెటతాను నీమేలుమర చిపోను [బంట్రోతురాగా శెట్టి శ్రీహరిలంగాలో దూరును)

శ్రీ— పొలిశెట్టిగారూ లేరూ యోసరూ లేరు లోపలికివస్తారేమి!

బం— ఆయనకు వారంటువచ్చినది ఆయనయిక్కడవున్నారని మాన మ్మకము. మేముసోదా జేయువలె నీవు ఆవలకువెళ్లు

శ్రీ —నన్ను వెళ్లమంటారేమి నాయిల్లుసోదా జేయుటకు మీకు అధి కారమేమున్నది ఆవలకువెళ్లండి

పో—(లోపలనుండి] అంతే! అంతే! నువ్వుకదలొద్దు! నీకాళ్లకు ద డం.

బం — అదుగో? నీవెనుకనెవరో మాట్లాడుచున్నారు నీవీవలకురా [దగ్గరకు పోబోగా శ్రీహరి అడ్డగించును)

బం— (త్రోసివేయుగా శెట్టిబైటబడును బంట్రోతు పట్టుకొనును) ప దా కోర్టుకు

పో—ఆ? ఆ? నీసంగతి కనుక్కుంటాను వుండూ? వుండూ! చెయ్యవద

లూ! వే యింట్లోబడితే ఆయింట్లో దూరటమే! శ్రీహరీ! పో లీసువారినిపిలువు, ఆ! అబ్బా! యెత్తికోమట్లోడనుకున్నా వుగామాలు చెయ్యిమలూ!

బం— ఆకేగడుసుతనముశేయక నడువు [గెంటును)

పో— అయ్యబాబో! చ పేస్తాండావు! మీరంతానాత్యం. వొదు లూ! చెయ్యి వొదులూ! శ్రీహరీ! వొదిలించు!

బం— నీవుచచ్చినా యొదలను మర్యాదగా రా!

పో— అయ్యో! కొత్తమనిషిలాగ మాట్లాడుతావేమిటి! యిట్లాంటి సమయము వొచ్చినప్పుడే రెండబ్బులు రాబట్టుకోపోతే యీ పదిరూపాయల జీతము తో సంసారం జరుగుద్దేంటి! యిది యెవరెరగని బాగవతం! తొందరపడతావే! పిచ్చివాడవులా గుండావు! పెట్టిలో నూరురూపాయల నోటుంది యిస్తాను తీసు కుపో! పుండూ! వొయి!

బం— ఇక ఆవస్నీపడవు అదుగో వాదుకపచ్చి యిక్కడేయున్నా రు తక్షణము రావలసినదే! నడువు! (లాగును)

పో— పోనీపదా! బయమనుకున్నావేంటి! యీలుతప్పితే యిన్సా ల్మెంటే దాఖలుచేస్తాను నన్నేంచాస్తారేంటి పదా! శ్రీ హారీ! వొకసారియిట్టా శూడా! మళ్లాపస్తానుదయుంచు!

తెరవాలును

రంగము-తారకానగరిములో నొకవీధి

(మాదిగ, డప్పుతోను మరియొక బ్రాహ్మణుడు నాగభూషణము ప్రవేశం)

బ్రా— ఓరబ్బీ అదేమిచాటింపురా!

మా— (డప్పువాయిస్తూ మీదకువచ్చి) యేంటియ్యా చలవిత్తాను

మనవిచెయ్యండి

బ్రా—బాగానేవుంది ఒరేమేము బ్రాహ్మణులముగదా! కుడిచెయ్యి యెడమచెయ్యిజూడకుండా మీదకువస్తావేట్రా! అవతలకుబో!

మా—ఏంటిబాబూ! నాయనబాబుగోలా! అట్టాయితే సెపుతా వినండి.

పాట

అర్దమేంటో సెప్పుకోండయ్య మీరుబేమ్మలైతే ॥అ॥ యెద్దునెక్కి-నోడు బోల్లి । గద్దనెక్కినోడు కూడ । యెవడుకన్నకొడుకులో । సెప్పుకోండి బేమ్మలైతే ॥అ॥ పుట్టలోనితాచియెవరు । పునాకలచుక్క యెవరు । అట్టిచుక్క అమ్మోర్ని కట్టుకున్నవారెవరు ॥అ॥

బ్రా—ఓరి వీడి తస్సాగొయ్యా! ఎటువంటి ప్రశ్నవేసినాడు. వీడితోనిప్పుడు మాట్లాడవలసిన సమయముకాదు ఒరే! నీప్రశ్నకు నేనర్థముజెప్పలేనుగాని నీచాటింపేమిటో జెప్పుదూ!

మా— యిస్ యింతేనా! మరిఇన్నెందుకు కదుపుతావు! పో పోవయ్యా నీదార్ని! అన్నలంగా నీమూలాన్నినాకాల్చి అయింది జేయ్ చమత్కారమైనవోరికి తెలియచేచేదేమంటే రేపుసాయంత్రం 3 గంటలకు పోలిశెట్టిగారిఆస్తి రిసీవరుగోరు ఆపీసులో యేలంయేత్తారుగాబట్టి కావల్సినోరు కొనుక్కోవల్సిందోహో

(నిష్క్రమించును)

నా— ఓహో! అట్లయిన రత్నమువమ్మిన లక్ష్మీకాంతాయునకు నాయాస్తినిగొని వ్యవహరించెద దైవకృప (నిష్క్రమించును)

రంగము-రిసీవరుకోర్టు

(రిసీవరుగుమాస్తా సుబ్బారావు పాటదార్లు కూర్చుందురు)

రి— సుబ్బారావుగారూ! పాటదారులెవరైనా! వచ్చినారా!

సు— చాలామంది వచ్చినారండీ!

రి— అయితే! పాటప్రారంభించండి ఏమండీపాటదార్లు ఒక్కొక్క

యూరాస్తి నొక్కొక్కలాటుగా పాడినబోడదరా!

పా— అలాగేపాడ త్రామండి

సు— తారకానగరములో పోలిశెట్టిగారితాలూకు దక్షిణపువీధిలో నున్నమేడ పడవలకాల్వదరినున్న రైసుమిల్లు బజారులోనున్న పదికొట్లుకలసి సర్కారుపాట యిరువదివేల రూపాయలు.

పా— 2500-3000-3500

నాగ— 40 వేలు (కొట్టివేయును)

సు— భీమనగరములోనున్న 100 యకరముల మాగానిభూమి సర్కారుపాట 10 వేలరూపాయిలు

పా—1100-1200-1300-1400

నాగ— 15వేలు (కొట్టివేయును]

సు— రాజమహేంద్రివరపు గోదావరి రేవులోనున్న 20 టన్నుల తొట్టిపడవలు 20 రాధారిపడవలు 10కి సర్కారుపాట ఆరువేలరూపాయిలు

పా— 7000-8000-9000

నాగ— 16 వేలు (కొట్టివేయును]

సు— సొమ్ముచెల్లగట్టంటి. [చెల్లించును నిష్క్రమించును]

తెరవాలును

రంగము-తారకానగరము

తెరముందు

జనార్ధనుడు ప్రవేశం

పాట

సదానందా! సకలేశ్వర! సదమలాత్మక । స్వప్రకాశ ! నిరాకార నిర్వికల్ప । పరమపురుష । పరాబ్రహ్మ ! పరిపాలిత సకలలోక ।

భాసిని నిజదాసస్నేహ । రక్ష రక్ష మాంరక్ష ॥స॥

నాటినాగభూషణుండను దీనభక్తుడు దైవానుగ్రహంబుచే సదృష్టవంతుండై యీ పురంబునం దఖిలైశ్వర్యములచే దులదూగుచున్న వాడట అతడు కడుమంచివాడు. అతనిగోరిన నాకేదేనియుద్యోగమిచ్చి యాదరింపగలడు. ఇప్పుడునేను నాజనార్ధన నామంబును మరుగుపరచి నారాయణవర్మయను నామంబు దాల్చి పోయెద. (నిష్క్రమించును) (తెరవాలును)

రంగము-నాగభూషణుని కచేరి

(లక్ష్మీ నారాయణ నారదులు ప్రవేశం)

వి— కమలా! నాగభూషణుని యునికికిదే సమీపించితిమి మనమీ రూపములతో బోకూడదు. నేనుజనార్ధన రూపంబుదాల్చెద నీవతని సతిరూపంబును దాల్చవలయు

ల— సరే! అట్లనేగానిండు, (నిష్క్రమించును)

[నాగభూషణం. నారాయణవర్మ వర్తకులు]

నాగ— ఏమండీవర్మగారు! మనచిఠాల జమాఖర్చులు తేలినవా!

వ— రాత్రి 12 గంటలవరకూ కూర్చుండి తయారుచేసినానండి

నాగ— దైవకృపవలన లాభనష్టము లెట్లున్నవి.

వ— ఈమూడుమాసములకు మిల్లుకాతాలో 3 వేలు ధాన్యంఖరీదులో 10 వేలు. లాభంవచ్చినది ఇంకా పడవలులెక్క తయారుకాలేదు దానిలో 5-6 వేలు మిగలవచ్చును

నాగ— దైవాజ్ఞ వచ్చుటకుబోవుటకు మనయత్నమా

(నౌకరు ప్రవేశం)

నౌ— అయ్యా! జనార్ధన మహారాజుగారట క్షమపురమట, రాజ్యము కనికి దానమిచ్చినారట. మిమ్ములనెరిగినవారగుటచే జూచి

వెళ్లవచ్చి పాట ద్వారమందున్నవారు

నాగ— (దిగ్గున లేచి సంతోషముతో) జనార్ధన మహారాజుగారా యొక్కడున్నారు. (పరుగెత్తి వెళ్లును)

వర్మ— ఏమిచిత్రము ఆజనార్ధనుడను నేనేగదా యీవచ్చినవారె వరుచెపుమా!

(లక్ష్మీనారాయణ నారద నాగభూషణులు ప్రవేశం)

నాగ— మహాత్ములారా! ఈయాసనముల నలంకరింపుడు వర్తకు లారా! మీరందరు రేపటిదినంబున రండు (వెళ్లిపోవుదురు) మహాత్మా!

పాట

ఆహాహా యెంతోసంతస । మొదవెన్ । మిమునేగనుగొన ॥ప॥

వెనుకటిపాపము । ద్రోయగలిగితిన్ । ముదమునమీదగు ముఖదర్శనమున । ఎన్నిగతులమిము జూడగదలచిన । నెందునకమపడి దెలియగలే ॥ద॥

దేవా! ఇదంతయూ దమప్రసాదము తమరిక నిశ్శంకతో నీయాస్తి వ్యాపారముల స్వాధీనముజేసికొని వెనుకటియట్లనాకు తమ పాదసేవ కత్వమిచ్చి పోషింప వేడుచున్నాడ.

వర్మ— (తనలో)

మ॥ అకటా! ఏమివిచిత్రమియ్యదిగదే ♦ యాఖ్యం బ్రవర్తించుయీ వికచాబ్జాక్షుడెవండో వీరెవరొకో ♦ విశ్వాసమేమందు వీ నికినాయందు సుదంకితంబు వినగా ♦ నేవేగదోస్త్రైచ్ఛతా వక సర్వస్వముగట్టబెట్టదలచె ♦ వారింను కేమందురో॥

కానిమ్ము ఇంకేమిజరుగునో జూచెద

వి— నాగభూషణా! నీకీయైశ్వర్యమెట్లులభించె!

నాగ— మహాత్మా! అట్లుదమరు

సీ॥ శాస్త్రిమస్థిక్కొసంగి ♦ రహిందమక్షేగిన
తోడనే నన్నుగొల్వ ♦ నూడ జెరికె
దిశగగట్టెలనమ్మి ♦ దెచ్చిబ్రతుకుచుండ
నొకపేటికొకనాడు ♦ యొక్కవనిత
దెచ్చినురలవచ్చి ♦ తీసికొనెదనింట
నుంచు నచునామె ♦ యుంచిపోవ
ధనతృష్ణనొకపునా ♦ దనిరచ్చవి గాక్షింప
గొట్టియూరను లేవ ♦ గొట్టెనన్ను
గీ॥ ఇందుజేటి నొకనాడు ♦ యింటిముందు
దొరుకసీసపుఘుళిక నా ♦ తరుణికింక
దానిగొనియొక్కజాలారి ♦ మీనమొసగె
రమణి గోయంగ దానిలో ♦ రత్నముండె

దానిని ఉత్తరూపాయలకమ్మితి దానచే యీ యైశ్వర్యము జేకూరె.
ఎంతైననూ తమపాదసేవకన్న నాకిదిసంతోషదాయకము గాదు. మహాత్మా! ఇదేభోగంబులంగైకొను డు.
దేవీ! అదృష్టమెట్టిదో యెరింగితివా నీసందేహము దీరినదా!
ల— ఆహా! మీమూలకులం దెలియ బ్రహ్మములకు వశమా!

సీ॥ పాండురాజ సుతుల ♦ పక్షంబువహియించి
కురుకులంబెల్లను ♦ గూల్చినావు
సురులపక్షముజేసి ♦ సుధపంచకసురుల
మోసగించితవుసు ♦ మోహినియయి
అదితిబిడ్డలపక్షమంది ♦ యాచకవృత్తి
నన్యాయముగబలి ♦ నణచినావు
భూసురపక్షంబు ♦ బూనిమీనంబవై
ఖలుడుసోమకుసబ్బి ♦ గలిపినావు

తే. గీ. కూడుకనదృష్ట పక్షంబు ♦ నేడునాకు
వాసిగా గర్వభంగ బు ♦ జేసినావు
బెమ్మిదిమ్మని దిమ్మని ♦ బెమ్మి జేయ
గలవు నీమాయ దెలియనా ♦ కళవియగు నె॥

వి— సఖ! నీవు మర్భ్రమ బడుచుంటివి. ఇందు నే జేయున్న దేమియు నూ లేదు.

గీ. కాలమరయుచు జీవుల ♦ కర్మఫలము
లంద జేయుదుగాని నే ♦ నన్యమెరుగ
తానెరుంగక బహుల చి ♦ త్తంబులఖల
భోగముల దేలించు నలతపా ♦ ల్యాని పోల్క॥

ల— అయిననూ సంతోషమేగాని ఆజనార్దనుడు మ్మాత్రము మీకు భక్తుడుకాడా! వానికి ఇంత్యావానం బిచ్చుటేమిన్యాయమూ!

వి— నీకుగల్గిన గర్వమే నాతనికింగల్గియుండుటచే నట్లనుభవింపవలసివచ్చె దీననాతడు గళంకరహితుడై మోక్షసామ్రాజ్యమును స్వీకరింప సమర్థుడై యిప్పుడిచ్చటనే యున్నవాడు మన మింక ప్రసన్నులమై వీరికి వరంబులిచ్చెదమూ!

ల— ఇంక సందేహమేమి

వి— నాగభూషణా! నీభక్తికి మెచ్చితిమి. ఇదే మానిజరూపంబుల దర్శనమిచ్చుచున్నాము గైకొనుము.

(నిజరూపంబులం జూపును)

నాగ—వర్మ—ఆహా! లక్ష్మీనారాయణులారా మాంపాహి మాం పాహి (పాదములపై బడుదురు)

పాట

నాగ—మాధవా। మాధవా। తమకృపచే। నాజన్మము ధన్యమయ్యె ॥మా॥ అఘచరుడను। యవివేకిని। నరపశుడను। మా

ఘన । సేవకులెన్న వలదుభక్తిన్ । నీపదముల్ । నాదుమనం

బునగొనిసే । భజనజేతు ॥మా॥

ధర్మ— గరుడగమన నేను ! యెంతెధన్యుడను । కనుగవమీదు ।

దర్శనమును బొందుటన్ । తమమహిమలు దెలియగనా ! తర

మౌనా । కరివరదా । వరమియ్యా! । దయగనుమా ॥మా॥

నాగ—

సీ. జయజయ గోవింద జయరమేశ ముకుంద । జయసచ్చి

దానంద జయతు జయతు।

ధర్మ— జయజయ లోకేశ జయతు భూతాత్మేశ । జయభక్తి జన

పోష జయతు జయతు!

నాగ— జయ జయదనుజారి జయతు పాతకహారి । జయనృకేసరి

శౌరి జయతుజయతు॥

ధర్మ— జయజయాపద్బంధొ జయకరుణాసింధొ । జయదశాశన వ

ధ జయతుజయతు॥

నాగ—జయతు గజరాజ రక్షకా । జయతుజయతు।

ధర్మ— జయతు ద్విజరాజవాహనా । జయతు జయతు॥

నాగ— జయతు నిర్గుణనిర్మల । జయతు జయతు॥

ధర్మ— జయతు శ్రీవైకుంఠనాయకా । జయతు జయతు॥

దాసులారా! మీభక్తికి మెచ్చితిమి వరంబులు గోరుకొను

డిచ్చెద.

నాగ— జననీజనకులారా! భవదీయదివ్య దర్శనప్రాప్తికన్న నేగోర

దగిన దెద్దియుం లేదుగాని

గీ. పలువిధంబుల నన్నుబ్రోవ ♦ బట్టుబట్టి

ధన ఘనంబులు గోల్పోయి ♦ వనిచరించు

నృపుజనార్దను కీకల్కి ♦ నెమ్మినొసగి
ని.న్నదమసన్నిధికి జేర్చు ♦ కన్నతండ్రి!

పర్వ—

గీ. దేవుడవు నీవుదెలియుని ♦ దేమిగలదు
వలదు నాకింకనీతుచ్ఛ ♦ వైభవములు
తమపదాంభోజములజేర ♦ విమలభక్తి
తోడబూజింప వరమునే ♦ గోరువాడ!

వి— జనార్దనా నీభక్తి ధర్మంబులకు నేసంతసించితిని నాగభూష
ణా వర్మ వేటల నిన్నాలించుచున్న యీతడే జనార్దనుడుసుమా!

నాగ— హా తండ్రీ (కాళ్లపైబడును)

మ. అకటా యెంతకృతఘ్నుడన్ కుమతి నే ♦ నజ్ఞానుడన్ ద్రోహినే
నొకనాడైనను మిమ్ము దర్చిన్నిజమే ♦ నొప్పార గుర్తించలే
దొకసామాన్యపువానిగా గమది మి ♦ మ్మూహించి పల్మారులో
యెకిమీడా! అలయింపజేసితిని కటా ♦ యీతప్పు సైరింపుమా!

జనా— మహాత్మా నీవునాకు మహోపకారివి నీయనుగ్రహంబున
గదా! నాకీదైవదర్శనం బబ్బినది లెమ్ము

వి— భక్తులారా! ఇటువినుడు

ఉ. వారక నాగభూషణుని ♦ బట్టి శనైశ్చరు డష్టకష్టముల్
గూరిమిబెట్ట రాజ్యమును ♦ గోరి జనార్దను గానకంప నీ
తీరున లచ్చిసందియము ♦ దీరగ వీనికదృష్టమీయనీ
నారదమౌని కారణము ♦ నాదగుదర్శనమున్ లభింపగన్

జనా-నాగ— ఋషికుల వతంసవగా తమను దెలిసికొనలేక పోయితి
మి యిదే నమస్కరించుచున్నాము తమకృపవలన
మేముధన్యులమయితిమి.

